# సనాతన సారథి

సత్య ధర్మ శాంతి ప్రేమలద్వారా మానవజాతి సామాజిక నైతిక ఆధ్యాత్మిక అభివృద్ధికి అర్పితము.

సంపుటము 34 డిశంబరు 1991 సంచిక 12

ముఖచిత్రం : "సూపర్ స్పెషాలిటీస్ హాస్పిటల్" ప్రారంభోత్సవానంతరం భగవాన్ బాబావారు, భారత ప్రధాని శ్రీ పి. వి. నరసింహారావు తదితరులు హాలులోనికి ప్రవేశించినప్పటి దృశ్యం.

లోపలిచిత్రం : "శ్రీ సత్యసాయి ఇన్స్టిట్యూట్ ఆఫ్ హైయర్ లెర్నింగ్" 10వ స్నాతకోత్సవ వేదికపై ఛాన్సలర్ భగవాన్ బాబావారు, భారత ప్రధానమంత్రి, వైస్-ఛాన్సలర్ తదితర ప్రముఖులు.

## విషయసూచిక





శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్సు ట్రస్టు, ప్రశాంతినిలయం తరపున ప్రమోద్‌కుమార్ సూరిచే, శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్ ప్రెస్సు ప్రశాంతినిలయంలో ముద్రింపబడి, ప్రచురింపబడినది
సంపాదకులు : వి. కె. నరసింహన్.

FAX: 91-08555-2190. గ్రామ్స్: బుక్‌ట్రస్టు, టెలిఫోన్: 2175 అండ్ 2036.
S. T. D. Code: 08555, I. S. D. Code: 91-08555

# దైవానుగ్రహం సంపాదించుట ఎట్లు?

"ప      ల యందు అనిశంబు అత్యంత అనురాగ భోగ భాగ్యములు కలిగినట్టి—భవ్యజనులు,
స్వపర భేదములేక సర్వజీవుల యందు సమభావమును చూపించెడి—సరసజనులు, కష్ట
ల యందు కరుణ వహించి దాతృత్వమును జూపు—ధన్యజనులు, సంసార
ధర్మమునందు సుజ్ఞానులై పరుల కాదర్శమును నిరూపించు జనులు మున్నగు
వారందరు భువిని సత్కీర్తిని గాంచి, సన్మార్గములో ప్రవర్తిస్తూ, తోటి
వారలలోసదామేటి వారలగుచు, నిత్యమూ ధర్మజిజ్ఞాసతో
ఉత్తమోత్తమమైన వ్యక్తులుగా రాణించెదరుగాక !!"

ప్రేమస్వరూపులారా!

సమస్త చరాచర ప్రపంచమంతయు ఒక్క దివ్యత్వము నుండియే ఆవిర్భవించి, దివ్యత్వమునందే జీవించి, ఆ దివ్యత్వము నందే లయమగుచున్నది. సృష్టి - స్థితి - లయ ములకు దివ్యత్వమే మూలకారణం. మానవుడు సంకల్పం నుండియే ఆవిర్భవించి, సంకల్పం చేతనే జీవించి, కడకు సంకల్పము నందే లయమగుచున్నాడు. "యద్భావం తద్భవతి". కనుక మానవ జీవితం సంకల్పముల పైననే ఆధారపడి ఉంటున్నది. ఎట్టి సంకల్పమో- అట్టి చర్య, ఎట్టి చర్యనో- అట్టి ఫలం, ఎట్టి ఫలమో— అట్టి గమ్యం. ఈ విధంగా మానవుని గమ్యం సంకల్పముల చేతనే కట్టుబడి ఉన్నది.

ఉత్తమ సంకల్పములను అభివృద్ధి పరచుకొని, ఉత్తమ జీవితమును అదర్శవంతంగా నిరూపించుకొని, ఉత్తమ ఫలితాన్ని పొంది, ఉత్తమ గమ్యాన్ని చేరుటకు ప్రయత్నించాలి. మానవ జీవితం గుణశీలములపైన ఆధారపడి ఉన్నది. మానవుడనగా ఆత్మధర్మమును అనుసరించు వాడేగాని, ఇంద్రియధర్మమును అనుసరించేవాడు కాదు. ఆత్మధర్మమే మానవధర్మం, ఇంద్రియధర్మమే పశుధర్మం. కనుక మానవుడు పశువు వలెగాక, పశుపతిగా మారుటకు తగిన కృషి చేయాలి. మానవుని యందు ఆవిర్భవించవలసినది ఈశ్వరభావమే గాని, ప్రకృతి భావము కాదు. ఈ ప్రకృతి నంతయు ఈశ్వరస్వరూపంగా భావించాలి. ఈశ్వర చైతన్యమునకు సృష్టియే ప్రధాన

చిహ్నం. దీనినే 'ప్రకృతి' అంటారు. కనుక, ఈ ప్రకృతి యందు ఆవిర్భవించిన ప్రతి మానవుడు ఈశ్వరభావాలనే కలిగియుండాలి. ప్రతి మానవుడు కూడను ఈ ఈశ్వర సృష్టిని ప్రకటన గావించే నిమిత్తమై తాను మూర్తీభవించినవాడననేసత్యాన్ని గుర్తించాలి. మానవత్వం దివ్యమైనది, పవిత్రమైనది. ఇది జీవించతగినది. ఈ జగత్తునందు ఇట్టి మానవత్వమే దివ్యత్వమనే సత్యాన్ని నిరూపించే నిమిత్తమై, అవతారములు ఆవిర్భవించుచున్నవి. దివ్యత్వమునందు దివ్యత్వమే ఆవిర్భవించాలి, దివ్యత్వమే ప్రతిబింబించాలి.

## ప్రపంచానికి దివ్యత్వమే ఆధారం

దివ్యాత్మస్వరూపులారా !

దైవం ఎక్కడో లేడు. మీరందరూ దైవస్వరూపులే. దీనిని పురస్కరించుకొనియే—"ఈశ్వరస్సర్వ భూతానాం' "ఈశావాస్యమిదం సర్వం" అన్నారు. మానవుడు అల్పమైన, అనిత్యమైన, అశాశ్వ_ ఈ లోక వాంఛలకు కట్టుబడి, విషయవాసనలకు లోబడి దివ్యమైన, భవ్యమైన, నవ్యమైన మానవత్వాన్ని వ్యర్థం చేసికొంటున్నాడు. ఈనాడు లోకంలో అధ్యాత్మికమునకు భౌతికముతో ఎట్టి సంబంధం లేదనియు, ఈ రెండింటికి మధ్య ఎంతో వ్యత్యాసమున్నదని భావిస్తున్నారు. ఇది కేవలం వెఱ్ఱితనమని చెప్పవచ్చును. భౌతిక అధ్యాత్మిక, నైతిక, లౌకిక, ధార్మిక, ఆర్థిక—పరిస్థితులన్నింటి యందు అధ్యాత్మికము అంతర్వాహినియై ఉన్నది. ఇట్టి దివ్యమైన అంతరార్థమును మనమీనాడు విస్మరిస్తున్నాం. అసత్యమైన, అనిత్యమైన ఈ విశ్వాన్ని మనం విశ్వసిస్తున్నాము. ఈ ప్రపంచం క్షణ క్షణమునకు మార్పు చెందునటువంటిదే. మార్పు చెందే ఈ ప్రపంచానికి మార్పుచెందని దివ్యత్వము ఆధారమై ఉన్నది. ఇట్టి ఆధార తత్త్వాన్ని లక్ష్యము నందుంచుకొన్నప్పుడే—ఆధేయములో ఆనందాన్ని అనుభవించుటకు మనకు అవకాశము ఉంటుంది. మనము ఏ కార్యమును చేసినప్పటికిని, ఏ మార్గమునందు ప్రవేశించినప్పటికిని దివ్యభావము చేతనే కొనసాగించుటకు ప్రయత్నించాలి. ఈనాటి మానవుడు చెలిమిని, బలిమిని, కలిమిని ఆశిస్తున్నాడేగాని, గుణమును ఆశించుట లేదు. గుణములేని కలిమి, బలిమి, చెలిమి-ఇవన్నియు స్థిరమైనవి కావు. కనుక మానవుని యందు ప్రధానంగా ఉండవలసినది—గుణం. ఇట్టి భావంచేతనే దివ్యత్వాన్ని స్మరిస్తూ రావాలి.

## సత్యమే భగవత్ స్వరూపం

ప్రకృతి వ్యర్థమైనది కాదు. మానవుడు అహంకార మయమైనప్పుడు, ఈ ప్రకృతిశక్తి కేవలం వికృతిగా మారుతుంది, ఆత్మపరమైనప్పుడు సుకృతంగా రూపొందుతుంది. కనుక వికృతికి గాని, సుకృతికిగాని మానవుని సంకల్పములే మూలకారణం. సర్వమూ సత్యమునుండియే ఆవిర్భవించినవి. సత్యమే భగవత్స్వరూపం. సత్యమే దివ్యమైనది. అందుచేతనే—"సత్యం నాస్తి పరోధర్మః" అని అన్నారు. సమస్తము సత్యముపైననే ఆధారపడి ఉంటున్నవి. "ఈ జగత్తంతయు సత్యము నుండియే సృష్టింపబడినది. సమస్త సృష్టి కూడను సత్యమునందే అణగియున్నది. ఈ జగత్తునందు సత్యమహిమ లేని స్థలమే కానరాదు. ఇట్టి శుద్ధ సత్త్వాన్ని పరికించండి".

## భారతీయ సంస్కృతిని గుర్తించు

మానవుడు ఎన్ని విద్యలు నేర్చినప్పటికిని, ఎంతటి శ్రీమంతుడైనప్పటికిని, ఎంతటి అధికారం చేపట్టినప్పటికిని గుణము లేకున్నచో ప్రయోజనం లేదు. గుణములన్నింటియందు దివ్యమైన భగవత్ భావములతో చేరిన గుణమే మానవత్వాన్ని వికసింపజేస్తుంది. ఇట్టి దివ్య భావములను గుర్తించినవారే భారతీయులు. కాని, నేడు భారతీయులు తమ సంస్కృతిని విస్మరిస్తున్నారు.

"పరమ పావనమైన భారతావని యందు సహనము కలిగియుండుటయే మనకు చక్కదనము, వ్రతములన్నింటికంటె మిన్నయైనట్టి ఘనసత్యశీలమే కఠినతపము. మన దేశమునందు మాతృభావమునకు మించిన మధుర భావమేమి కలదు? ఇట్టి భవ్యభావాలతో కూడియున్న భారతీయ దివ్యసంస్కృతి యొక్క తత్త్వాన్ని గుర్తించుటకు నేడెవ్వరూ యత్నించుట లేదు. ఇంతకంటే దౌర్భాగ్యమేమి కలదు? ప్రాణము కంటే మానమే ఘనమని బోధించే మన దేశనీతిని మంటగలిపి, పరదేశ నీతులరసి ఈనాడు విచిత్రమైన స్వేచ్ఛ అనెడి 'విచ్చుకత్తి' ని మన భారతీయులు సంపాదించుకొన్నారు. ఏనుగెట్టుల తన బలమెరుగలేదో- అట్టులైనారు మన భారతీయులు నేడు".

మన బలాన్ని మనం గుర్తించుకొనలేక, పరుల బలమునే ఆధారంగా జేసికొని, పరుల కాళ్ళపైన ఆధారపడే జీవితం అస్థిరమైనది. భారతీయుల సంస్కృతి స్వశక్తిపైన, ఆత్మ విశ్వాసముపైన ఆధారపడి ఉన్నది. ఆత్మవిశ్వాసమే సమస్తమునకు మూలకారణం. ఈనాడు భారతీయులు ఆత్మవిశ్వాసాన్ని కోల్పోవుటచేత, ఇట్టి దురవస్థలకు గురికావలసి వస్తున్నది.

## ఆత్మ విశ్వాసం పెంచుకో

దివ్యాత్మస్వరూపులారా! మీరే ఆత్మ స్వరూపులైయుండి, మిమ్మల్ని మీరు విశ్వసించకపోవుటకు మూలకారణం మీలోని బలహీనతయే. నీ తత్త్వాన్ని నీవు గుర్తించు. అప్పుడే నీ యందు నిజమైన శక్తిసామర్థ్యాలు అవిర్భవిస్తాయి, వ్యక్తమౌతాయి, ఆనందాన్ని అందిస్తాయి. కనుక, ఈనాడు మానవునకు ఆత్మ విశ్వాసం అత్యవసరం. సమస్త భోగములకు, సమస్త సిరిసంపదలకు ఆత్మవిశ్వాసమే మూల కారణం. కనుక ఆత్మవిశ్వాసాన్ని మనం అభివృద్ధి పరచుకోవాలి.

ఈనాడు ప్రపంచం అనేక విధములైన అల్లకల్లోలముల చేత, అశాంతి చేత కుమిలిపోతున్నది. ఇటువంటి పరిస్థితిలో మనం చేయవలసిన పని ఏమిటి? ఈ అశాంతిని దూరం గావించే శక్తి మన యందే ఉన్నదా? కేవలం ఒక్క వ్యక్తి మాత్రమే ఈ అశాంతిని దూరము గావించగలడా? అనే బలహీనతకు మనము ఏమాత్రము చోటివ్వకూడదు. ప్రతి భారతీయుడు ఆత్మవిశ్వాసంతో ముందంజ వేసినప్పుడు, ఒక్క క్షణంలో ఈ అశాంతినంతటిని దూరం గావించవచ్చును. నేడిట్టి విశ్వాసాన్ని కోల్పోవుట చేతనే, మనం ముందంజ వేయలేకపోతున్నాము.

ముఖ్యంగా ప్రతి మానవునకు పరోపకార దీక్ష అత్యవసరం. ప్రతి మానవుడు దైవాంశ సంభూతుడే. తోటి మానవులపై ప్రేమ కలిగియుండనిచో— అది మానవత్వమే కాదు. కాబట్టి, అందరూ దైవసంతతికి సంబంధించిన వారనే సత్యాన్ని గుర్తించి, సర్వులయందు

ప్రేమతత్త్వాన్ని ప్రకటించి, ప్రతి మానవుడు ఆదర్శప్రాయుడుగా రూపొందాలి.

మన భారతదేశంలో సిరిసంపదలకు ఏమాత్రం కొదువలేదు. మన భారతదేశం శ్రీమంతమైనది. ఒకవేళ ఈ దేశం దరిద్ర దేశమై ఉండినచో, పూర్వం తురుష్కులు గాని, ఫారసీకులుగాని, బ్రిటీషువారుగాని ఈ దేశంపై దండెత్తి వచ్చెడివారు కాదు. ఈ దేశం సిరిసంపదలతో తులతూగుచున్నది కనుకనే, విదేశీయులందరికీ మన దేశంపై కన్నుపడింది. ఇట్టి పవిత్రమైన భారతదేశాన్ని మన భారతీయులే బీదదేశముగా భావించి, దీనిని చిన్న బుచ్చుచున్నారు. దీని వలన కలిగే ప్రమాదం ఒకటున్నది. అది ఏమిటంటే—మనయందు ఒక విధమైన అవిశ్వాసమనేది అభివృద్ధి కాగలదు మనయందున్న తిరోగతిని పురోగతి గావించినప్పుడే, మన జీవితం ఉత్తమ గతిని పొందుతుంది, లేనిచో మానవ జీవితమే అధో గతి పాలౌతుంది. ధనకనక వస్తు వాహనాదులు మనకు ముఖ్యం కాదు. ఇవన్నియు కదిలి పోయే మేఘముల వంటివే. గుణమే మనకు నిత్య సత్యమైన సంపద. అట్టి గుణసంపదను మనము అభివృద్ధి గావించుకోవాలి.

## ఆస్పత్రి నిర్మాణంలో గల అంతరార్థం

పరోపకార సంబంధమైన గుణమే మానవుని దివ్యత్వాన్ని ప్రకాశింపజేస్తుంది. కనుక వ్యక్తులకుగాని, సమాజమునకుగాని, దేశమునకుగాని, ప్రభుత్వమునకుగాని. ఆదర్శాన్ని నిరూపించే నిమిత్తమై స్వామి చిన్న విషయములు మొదలుకొని, పెద్ద పెద్ద కార్యములను ప్రారంభిస్తున్నాడు.

పూర్వం ఈ పుట్టపర్తి జనాభా 200 మంది మాత్రమే. ఇలాంటి కుగ్రామంలోనే ఒక "యూనివర్సిటీ" ప్రారంభం కావటం కలలోని వార్త. ఎన్నో ముఖ్య పట్టణములలో లేని "ఎయిర్‌పోర్ట్" ఈ కుగ్రామంలో ఏర్పడుట మరొక విచిత్రం. యావత్ప్రపంచానికే ఈ పుట్టపర్తి ఒక ప్రధానమైన కేంద్రంగా రూపొందుతున్నది.

సర్వ సౌకర్యములున్న పట్టణములందు ప్రారంభించవలసిన ఈ పెద్ద "హాస్పిటల్"ను ఈ కుగ్రామమునందే ప్రారంభించుటకు గల కారణమేమిటని మీరు విచారించాలి. శ్రీమంతులైనవారు, ధనమున్నవారు ఎక్కడికైనా వెళ్ళి ఎన్ని లక్షలైనా ఖర్చు పెట్టుకొని రోగ నివారణ గావించుకోవచ్చు. కాని పేదవారు వైద్యసౌకర్యముల నిమిత్తమై గ్రామాన్ని వదలి దూర ప్రాంతాలకు పోలేరు. అట్టి గ్రామ ప్రజల క్షేమమును పురస్కరించుకొనియే ఈ పెద్ద ఆసుపత్రి పల్లెయందే ప్రారంభించుట జరిగినది. "మొట్టమొదట పల్లెలలో ఉన్న వారి గుండెజబ్బులను ప్రత్యేకంగా చూడండి" అని మా డాక్టర్లకు చెప్పాను.

ఈనాడు ఒక శుభవార్తను ప్రకటించ వలసియున్నది. మన భారతదేశ ప్రధాన మంత్రి ఆసుపత్రిని ప్రారంభించిన తరువాత 15 ని॥లలో మన డాక్టర్లు "ఆపరేషన్" చేయుటకు ప్రారంభించినారు. 3గం॥ల లోపల నాలుగు పెద్ద ఆపరేషన్లు జరిగాయి. ఒకటి చాలా జటిలమైన గుండె ఆపరేషన్. ఆ వ్యక్తి గుండెకు రంధ్రము ఉండియున్నది. అటువంటి ఆపరేషన్ కూడా విజయవంతంగా జరిగింది. అందరూ క్షేమంగా ఉన్నారు.

## రోగనివారణయే మా సంకల్పం

మా ఉద్దేశ్యంలో మొట్టమొదటగా ప్రధానమైనది గుండె. దానిపైన ఊపిరితిత్తులు. మూడవది మూత్రపిండములు, తరువాత మెదడు— ఈ నాల్గింటికి ప్రత్యేకమైన ప్రాధాన్యతనిచ్చి, పల్లెలవారికి వీటికి సంబంధించిన రోగములను పూర్తిగా నివారణ గావించాలనే ఉద్దేశ్యంతోనే ఈ అసుపత్రిని ప్రారంభించాము. అయితే, మాకు పల్లెప్రజలు, పట్టణప్రజలు అనే భేదం లేదు. రోగం పల్లెప్రజలనే వరించి, పట్టణ ప్రజలను వరించకుండాపోదు. రోగములకు ఇట్టి వ్యత్యాసమేలేదు. కనుక, మాకు కూడను రోగనివారణ యందు ఎట్టి వ్యత్యాసం లేదు. పల్లెలవారు గాని, పట్టణములవారు గాని— ఎవ్వరికైనా రోగనివారణ గావించుటయే మా సంకల్పం.

ఈనాడు అసుపత్రులన్నీ వ్యాపార సంస్థలుగా రూపొందుతున్నాయి. కొంతమంది పది కోట్లు ఖర్చుపెట్టి అసుపత్రి ప్రారంభించారంటే నూరు కోట్ల ఆదాయం వారి హృదయంలో ఉంటుంది. ఇలాంటి స్వార్థ స్వప్రయోజనాల కొరకు ఈ అసుపత్రులను ప్రారంభిస్తున్నారు. కాని, సాయి యందు కాలి మొదలు తల వెంట్రుక వరకు నిస్వార్థమే - నిస్వార్థమే. సాయి యందు ఏమాత్రము స్వార్థము లేదు, ఇలాంటి సత్యాన్ని గుర్తించడానికి ఎవ్వరూ ప్రయత్నించుట లేదు.

## ఆరోగ్యమే మహాభాగ్యం

ప్రపంచంలో మనం ఎట్టి కార్యమును ప్రారంభించవలెనన్నను శరీరం అత్యవసరం. "శరీర మాద్యం ఖలు ధర్మ సాధనం". సర్వ కర్మలకు శరీరమే మూలకారణం. ఈ శరీరం ఆరోగ్యవంతంగా ఉండినప్పుడే, ఎట్టి కార్యములనైనా మనము చేయగలము. మానవుడు "ధర్మార్థకామ మోక్షములు" అనే చతుర్విధ పురుషార్థములతో కూడియున్నాడు. "ధర్మార్థ కామ మోక్షాణాం ఆరోగ్యం మూలముత్తమం". మనం ఏ కార్యములో ప్రవేశించవలెనన్ననూ ఆరోగ్యం అత్యవసరం. కనుక, "ఆరోగ్యమే మహాభాగ్యము"ని భావించి, ఇట్టి ఆరోగ్యాన్ని అందించే నిమిత్తమై మేము ఇలాంటి సంస్థలను ప్రారంభిస్తూ వస్తున్నాము. అయితే, ఆరోగ్యముగా ఉండుటచేత ప్రయోజనమేమి? ఈ ఆరోగ్యవంతమైన దేహం చేయవలసిన కార్యములలో ప్రవేశించాలి. దుర్మార్గములో ప్రవేశించే శరీరము ఉండినను ప్రయోజనం లేదు. ఈ ప్రపంచములో శరీరాన్ని ధరించినందుకు దానికి సరియైన సార్థకతను పొందాలి.

## ఐదు నెలలలో ఐదేళ్ళ ప్రాజెక్టు పూర్తి

ఈ అసుపత్రి కట్టిన విధానాన్ని కూడా మనం కొంత విచారించాలి. L. & T. Brothers ఎన్నో కట్టడాలను నిర్మింపజేసారు. మన దేశమునందేగాక విదేశములందు కూడా వారి ప్రభావం ఎంతో ఉంటున్నది. కాని, వారు ఎన్నో చోట్ల కట్టడాలను నిర్మింపజేసినప్పటికీ, ఇక్కడ పని చేసిన పనివాళ్ళ అనందాన్ని వారు ఎక్కడా చూసి ఉండలేదు. అనందంతో, ఉత్సాహంతో ప్రతి చిన్న పనివాడు కూడా పదిమంది చేయవలసిన పనిని ఒక్కడే చేస్తూ వచ్చాడు. పనివారందరూ శ్రద్ధాభక్తులతో ఈ కార్యంలో ప్రవేశించారు. నేను 'మే' నెలలో

కొడైకెనాల్ నుండి వచ్చినతరువాతనే ఈ కార్యమును ప్రారంభించాం. ఈ ఐదు నెలలలోనే 5 సం॥ల ప్రాజెక్టును పూర్తిచేసారు. ఇది చాలా పెద్ద ప్రాజెక్టు. ఈ ప్రాజెక్టు వేయి సంవత్సరములకు సరిపోవునటువంటిది. ఇంక భవిష్యత్తులో ఉత్తరోత్తరా దీనిని ఎవ్వరూ అభివృద్ధి చేయనక్కరలేదు.

## భగవత్ సృష్టిలో అష్టశక్తులు

ప్రేమస్వరూపులారా!

ఈ ప్రపంచమంతా పరమాత్ముని ప్రతిస్వరూపమే. అష్టైశ్వర్యస్వరూపుడైన భగవంతుడు అష్టశక్తులచేత సృష్టినంతయు వ్యాపించి ఉన్నాడు. మానవునకు ప్రధానమైనది, ప్రాణముతో సమానమైనటువంటిది—జలం. ఈ భూ మం డ ల ము రెం డిం ట మూ డు భాగములు జలముతో నిండి యుంటున్నది. ఉపనిషత్తులు ఈ జలమును "జీవం" అని అంటున్నాయి. కనుక జలస్వరూపుడైనవాడు పరమాత్ముడే. రెండవది అగ్ని. ఈ అగ్ని ప్రతిమానవుని ఉదరమునందు 'జఠరాగ్ని'గా ఉంటున్నది. ఈ జఠరాగ్నియే లేకుండిన మానవుడు భుజించిన ఆహారం జీర్ణింపబడి, ఆ రసస్వరూపం సర్వాంగములకు పంపబడే అవకాశమే ఉండదు. మానవుని యందున్న రక్తము, కండరములు మొదలగునవన్నియు రసస్వరూపమైనవే. కనుకనే భగవంతుని— "అంగీరసాయనమః" అన్నారు. ప్రతి అంగమునందు రసస్వరూపుడుగా ఉండుటచేత, అతనికి "రసస్వరూపుడు" అని పేరు. ఈ అంగీరసుడు అగ్నిస్వరూపుడు. మూడవది—భూమి. ఈ భూమి యందే సమస్త సృష్టి - స్థితి - లయములు జరుగుతున్నవి. మానవునికి కావలసిన ఆహార సదుపాయములన్నీ భూమి నుండియే ఆవిర్భవించుచున్నవి. ఈ భూమి మానవునికి సరియైన ఆనందాన్ని అందించే స్వరూపం. కనుక, భూమి కూడను భగవత్స్వరూపమే. వాయువు ప్రాణమునకు అ ప్త మి త్రు ని వం టి ది. ప్రతిమానవుడు ఉచ్ఛ్వాస—నిశ్వాసముల చేత గాలిని అనుభవిస్తున్నాడు. ఈ గాలిని పీల్చుకొనే సమయములో 'సో...' అనియు; విడిచిపెట్టే సమయములో 'హం...' అ ని యు అంటున్నాము. "సో...హం" ఈ రెండింటి యందే మానవత్వము ఇమిడి ఉంటున్నది. దీనినే పోతన ఈ విధంగా చెప్పాడు—

> "పలికెడిది భాగవతమట
> పలికించెడి 'వాడు' రామ భద్రుండట
> 'నే' పలికిన భవహర మగునట"

'నే-వాడు' ఈ రెండు పదములనే పోతన ఇందులో అమర్చాడు. పలికించెడిది-వాడు, పలికెడిది-నేను. సంస్కృతమునందు 'వాడు' అనే పదమును 'సః' అనియు, 'నేను' అనే పదమును 'అహం' అనియు అన్నారు. ఈ రెండూ చేరినప్పుడు, 'సః + అహం=సోహం' అని మారిపోయింది. కనుక, వాయుతత్త్వము మనకు ఏమి బోధిస్తున్నదంటే—'నేను వాడే' అనే సత్యాన్ని నిరూపిస్తున్నది. అనగా, 'నేనే దైవం' అనే పరమ పవిత్రమైన ఏకత్వాన్ని ప్రబోధిస్తున్నది. ఈ వాయువు మన యందు దినమునకు 21,600 పర్యాయములు సంచరిస్తున్నది. ఈ వాయుస్వరూపమే మన యందు

లేకపోతే మన జీవితమే వ్యర్థమైపోతుంది. కనుక వాయుస్వరూపము కూడా భగవంతుడే.

ఐదవది ఆకాశం ఈ పంచభూతములకు అవకాశం కల్పించేదే ఆకాశం. పంచభూతము లన్నియు ఆకాశము నుండియే ఆవిర్భవించి నవి. ఆకాశం శబ్ద స్వరూపం, శబ్దం బ్రహ్మ స్వరూపం. "శబ్ద బ్రహ్మమయి, చరాచర మయి, జ్యోతిర్మయి, వాఙ్మయి, నిత్యానంద మయి, పరాత్పరమయి, మాయామయి, శ్రీమయి"— ఈ అష్టశక్తులందు మొట్టమొద టిది శబ్ద బ్రహ్మమయి. సర్వత్రా వ్యాపించి యున్నది శబ్దమే. ఆకాశం ఎక్కడున్నదంటే, పైన ఉన్నదని చూపిస్తున్నాం. కాదు, కాదు. శబ్దం ఎక్కడ ఉన్నదో, అక్కడ ఆకాశం ఉన్నది. సర్వ అవకాశములను చేర్చుకొనేది ఆకాశం. కనుక, ఇది భగవత్ స్వరూపమే. ఇంక ఆరవది సూర్యుడు. ఇతడు ఉష్ణస్వ రూపుడు. ఈ ఉష్ణము ఏరీతిగా ఆవిర్భవిస్తు న్నది? సూర్యుని యందున్న హైడ్రోజను హీలియంగా మారేటప్పుడు ఉష్ణం ప్రారంభ మౌతున్నది. ఇది వైజ్ఞానిక ధర్మం. దీని తత్త్వం వివిధంగా ఉన్నదని విచారణ చేస్తే— ఒక సెకెనుకు సూర్యునిలో ఉండిన ఉష్ణం 4 వేల లక్షల టన్నుల శక్తిని కోల్పోతున్నది. అయినప్పటికిని ఇంకా కొన్ని వేల మిలియన్ల సంవత్సరముల వరకు ఈ సూర్యుడు ఉష్ణాన్ని అందిస్తుంటాడు. ఇతని శక్తి అట్టిది, ఇట్టిది అని ఎవ్వరూ చెప్పలేరు. కనుక భగవంతుడు అవాఙ్మానస గోచరుడు. అతని నుండియే సర్వమూ ఆవిర్భవిస్తున్నది. ఈ సూర్యుడు బుద్ధికి అధిపతి. మానవునికి బుద్ధి అత్యవసరం మానవుని బుద్ధిని ప్రకాశింప సెవాడే సూర్యుడు.

ఇంక ఏడవది చంద్రుడు. ఈ చంద్రుడు మనస్సునకు అధిపతి. ఇతడు మనస్సు ద్వారానే ప్రశాంతమైన భావాలను అభివృద్ధిగా విస్తూ వస్తున్నాడు. మనస్సు యొక్క స్వరూపమే ఈ ప్రపంచము. "మనో మూలమిదం జగత్". మనస్సే లేకపోతే— జగత్తే లేదు. నీవు ఇక్కడ ఉండినంతవరకు నీ దేహము ఇక్కడ ఉన్నదిగాని, నీమనస్సు ఒక్క క్షణంలో హైదరాబాద్, ఢిల్లీ నగరాలకు ప్రయాణం చేయగలదు. కనుక, మనో వేగ మునకు మించిన వేగము మరొకటి లేదు. కాంతి వేగముకంటే, మనో వేగం అత్యంత అధికమైనది. ఎనిమిదవది కర్మశక్తి. ఈ కర్మ కూడను భగవత్స్వరూపమే.

"మానవుడు కర్మ చేతనే జన్మించును, వృద్ధిపొందును. తిరిగి కర్మచేతనే మరణిం చును. ఈ కర్మ మానవునకు ప్రాణంవంటిది. ఈ ప్రపంచములో మన సుఖ-దుఃఖములకు మూలకారణం ఈ కర్మయే".

దీనికే ప్రాచీన ఋషులు "యజ్ఞం" అని పేరు పెట్టారు- "యజ్ఞోవైవిష్ణుః". ఈ యజ్ఞమే విష్ణుస్వరూపం, ఆ విష్ణుస్వరూపమే విశ్వం. కనుక ప్రపంచమంతయు అష్టైశ్వర్య స్వరూపుడైన భగవంతుని యొక్క సృష్టియే అని గుర్తించాలి.

### పంచభూతముల దుర్వినియోగమే దుఃఖానికి మూలకారణం

ఈనాటి మానవుడు ఈ పంచభూతము లను సక్రమమైన మార్గములో వినియోగించు కొనుటలేదు. అందుచేతనే మానవుడు అనేక

దుఃఖములకు గురియౌతున్నాడు. శబ్ద స్పర్శ రూప రస గంధాదులను దుర్వినియోగ పరచు కొంటున్నాడు. భగవంతుడు ప్రసాదించిన, భగవత్స్వరూపమైన ఈ పంచభూతములను దుర్వినియోగ పరచుటచేత, భగవదనుగ్రహానికి దూరమై భగవదాగ్రహానికి సమీపమౌతున్నాడు. కనుకనే, పంచభూతములు మానవుని అస హ్యించుకొంటున్నాయి. నేటి మానవుని నుండి వెలువడే శబ్దములన్నీ దుశ్శబ్దములే. నిరంతరం పరదూషణ, పరనిందలో కాలం గడుపుతు న్నాడు. ఇవేనా మానవుడు పలుకవలసినది ? కాదు, కాదు. మానవుని స్వరూపం చాలా దివ్య మైన, నవ్యమైన, ఆనందమైన స్వరూపమని నిరూపించాలి.

ఈనాడు మానవుని దృష్టి యంతయు మలినమైనదిగా ఉంటున్నది. దుర్భావాలతో కూడి ఉంటున్నది. నేటి మానవుని శ్రవణం సరియైనదిగా లేదు. మానవుని వినికిడి శక్తి ఏమంటున్నది ?— "ఓ చెవులారా ! పొద్దు పోక ఊరివారి సుద్దులు వినాలంటే, కడు శ్రద్ధ తోడ మీరు సిద్ధమౌతారెందుకు ? ముద్దు ముద్దుగా భగవత్ ముచ్చటలను ఎవరైనా చెప్పేటప్పుడు మీరు ఒద్దికగా ఉండరెందుకు?" చెడ్డమాటలు వినాలనుకుంటే, రెండు చెవులు శ్రద్ధగా చేరి, ఐకమత్యంగా వింటాయి. ఐతే, మంచిమాటలు వినాలనుకుంటే, ఒక చెవి ఒకవైపు, రెండవ చెవి రెండవవైపు వెడతాయి. ఈ చెవులు తమ కర్తవ్యాన్ని విస్మరించి, దుర్మార్గములో ప్రవేశించుట చేత మానవుని మనస్సంతా మాలిన్యమైపోతున్నది. మనము పీల్చే గాలి కూడా కల్మషంగా ఉంటున్నది. వాతావరణం మలినంగా మారిపోతున్నది. మలినమైన గాలిని పీల్చుట చేత, మనలో మలినమైన భావాలే ఆవిర్భవిస్తున్నవి. కనుక ఈ పంచభూతములను దుర్వినియోగ పరచు టయే మన కష్టములకు, దుఃఖములకు మూలకారణం.

## ఎట్టి విద్యలు నేర్చుకోవాలి ?

ఈనాడు హృదయాన్ని మాలిన్యపరచే విద్యలనే మానవుడు నేర్చుకొంటున్నాడు.

"నేటి మానవులు మంచి పదవులను, మంచి బ్రతుకును కోరుకొనుచున్నారేగాని— మంచి బుద్ధులను, మంచి నడతను కోరుకొనుటలేదు. ధన ప్రాముఖ్యము అధికమైపోయినది, ధర్మ చింతన క్షీణించిపోయినది. నేటి విద్యల మూలంగా జరుగుచున్న ప్రోగ్రెస్సు(అభివృద్ధి) ఇదే".

"నీతి-నియమాలు గ్రంథాల వరకే పరిమి తమైపోయినవి. మానవ హృదయాలు మాలిన్య సదనములుగా మారిపోయినవి. మానవుల చేత లన్నియు స్వార్థపూరితమైపోయినవి. నేటి విద్యల మూలంగా జరుగుతున్న ప్రోగ్రెస్సు ఇదే".

మనం నేర్వవలసిన విద్యలు ఇట్టివి కావు. ఈనాడు మానవుడు స్వార్థ స్వప్రయో జనాలను అభివృద్ధి పరచే విద్యలను అభ్యసి స్తున్నాడు. మనము పవిత్రమైన, పరోపకార సంబంధమైన విద్యను నేర్చుకోవాలి. మానవు లందు ఏకత్వాన్ని సాధించే విద్యలను, దివ్య మైన ఆత్మస్వభావాన్ని నిరూపించే విద్యలను

నేర్చుకోవాలి. ఈనాడు సరియైన విద్యావంతు డెవ్వరూ నా దృష్టిలో కనిపించుట లేదు. అందరూ అవిద్యా శిఖామణులే. కేవలం పుస్తకాలను చదువుతున్నారు, వ్రాస్తున్నారు. ఈ విధంగా చదివి, వ్రాయ నేర్చిన వారంతా విద్యావంతులు కారు. కాలేజీ డిగ్రీలను పొందిన వారంతా విద్యావంతులు కారు. సుజ్ఞానం, సుకృతం అందించని విద్యలు సద్విద్యలు కావు. "బ్రతుకుటకే విద్యయ న్నచో, బ్రతుకుట లేదె పశుపక్ష్యాదులు" ఈనాడు కేవలం జీవనోపాధి నిమిత్తమై విద్యలు నేర్చుకొంటున్నారు. కాని, జీవితపరమావధిని గుర్తింపజేసే విద్యలను నేర్వాలి.

## జీవనోపాధి—జీవితపరమావధి

ఈ జీవిత పరమావధి, జీవనోపాధి అనగా ఏమిటి? దీనికొక చిన్న ఉదాహరణః ఒక సైంటిస్టు ప్రయోగశాల (Laboratory) కు వెళ్ళి "రెండు భాగాలు హైడ్రోజను, ఒక భాగం ఆక్సిజన్‌లను కలిపితే నీరు తయారౌ తుంది" అని నీరు తయారయ్యే విధానాన్ని గురించి బోధిస్తాడు. ఇది జీవనోపాధి. అయితే, ఈ ఏర్పడిన కొద్ది జలాన్ని అందరూ సమంగా ఏరీతిగా పంచుకోవాలి అనే సమత్వాన్ని బోధిం చుటయే — జీవిత పరమావధి. కనుక, నీరును సృష్టించుట జీవనోపాధిగా ఉంటు న్నది, ఆ సృష్టించిన జలాన్ని సమానంగా అందరికి పంచే సమభావమే జీవితపరమా వధిగా ఉంటున్నది. ఈ రెండింటి ఏకత్వము చేతనే మానవత్వము దివ్యత్వముగా మారిపో తుంది. నీరు సృష్టించినప్పటికిని, త్రాగేవారు లేకపోతే ఏమి ప్రయోజనం?

## గుణమే నిజమైన శృంగారం

ప్రేమస్వరూపులారా!

"ఆకాశానికి చంద్రుడే శృంగారం. సముద్రానికి అలలే శృంగారం. ఊరికి ఇళ్ళు శృంగారం. కొలనుకు తామర పుష్పమే శృంగారం. అదే విధంగా మానవునకు గుణమే శృంగారం". ఈ గుణము లేకుండా ఎంత అలంకారము చేసుకొన్నప్పటికీ, ప్రయోజనం లేదు. భగవంతుడిచ్చిన శృంగారమే నిజమైన శృంగారముగా విశ్వసించాలి. God is beauty (భగవంతుడు సుందర స్వరూపుడు). అట్టి భగవంతుడిచ్చిన శృంగారము పైన వేరొక అలంకరణ లెందుకు వేసుకోవాలి? తెల్లగా ఉన్నవారు "ఫేస్‌పౌడరు" ఎందుకు ఉపయో గించాలి? గుణమే నిజమైన శృంగారం. కనుక, నిజమైన శృంగారము మన దగ్గర ఉన్నప్పుడు కృత్రిమమైన శృంగారాలు మనకు అవసరం లేదు.

ఈనాడు మనకు శరీరం అత్యవసరం. ఈ శరీరాన్ని సద్వినియోగ వరచుకొనుటకు సద్గుణములు అత్యవసరం. ఈ రెండింటిని చక్కగా కలిగియుంటే, మనం ఆదర్శవంత మైన జీవితాన్ని అనుభవించవచ్చును. ఈ జగత్తునకే ఆదర్శప్రాయులుగా రూపొంద వచ్చును. దేహమే ప్రధానంగా భావించుకొని, గుణమును విస్మరించినప్పుడు మన జీవితమే వ్యర్థమైపోతుంది. మానవ జన్మ అతి దుర్లభ మైనది. కనుకనే— "జంతూనాం నరజన్మ దుర్లభం" అన్నారు. ఇంత విలువైన, పవిత్ర మైన మానవ జన్మను మనం కేవలం "మసి

బొగ్గుల" కొరకు అమ్ముకొంటున్నాం- "మాణి క్యము" నకై అమ్ముకోవాలి. ఇట్టి మానవ జీవితంలో దుర్గుణాలు, దురాలోచనలు దూరం గావించుకొని, సద్భావములను, సదాచారములను మనము అభివృద్ధి గావించుకొన్నప్పుడు, దేశం నిత్యకళ్యాణం పచ్చతోరణంగా వుంటుంది.

## అందరూ నాకు సమానమే

ప్రేమస్వరూపులారా!

ప్రతి ఒక్కరు తెల్లవారి లేచినదిమొదలు రాత్రి పరుండు వరకూ — "లోకాస్సమస్తా స్సుఖినో భవంతు" అని ప్రార్థించండి. 'నేను-నా వారు' అనే సంకుచితభావాలను త్రుంచి వేసి, అందరూ సుఖముగా ఉండాలని కోరు కోండి. అందరూ బాగున్నప్పుడే, నీవు కూడా బాగుంటావు. నీ క్షేమమంతయు, నీ ఆనంద మంతయు సమాజంపైననే ఆధారపడి ఉంటు న్నది. సమాజ క్షేమానికి, ఆనందానికి మనం కృషి చేయాలి. సమాజ క్షేమాన్ని మనము ఆశించాలి. నిన్ను ద్వేషించేవారిని కూడా నీవు ప్రేమించు. అదే సాయి నిరూపిస్తున్న ఆదర్శం.

నిజం చెప్పాలంటే, ఈ ప్రపంచంలో నాకు అయిష్టమైనవారు ఎవ్వరూ లేరు. నేనంటే వారికి అయిష్టము, ద్వేషము ఉండవచ్చును. "అందరూ నాకు సమానమే." ఈ సమత్వాన్ని కొంతైనా మీరు సాధించండి "భగవంతుడు దయాస్వరూపుడు, కరుణా సముద్రుడు, ప్రేమ స్వరూపుడు అంటారు, అయితే నా కష్టాలను, నష్టాలను ఏమాత్రము భగవంతుడు నివారణ గావించుటలేదు" అని కొంత మంది భక్తులు తమలోతాము వాపోతుంటారు. భగవంతుడు సత్య స్వరూపుడే, ప్రేమ స్వరూపుడే, దయాసాగరుడే. కాని, అట్టి ప్రేమ స్వరూపుని ఆజ్ఞను మీరు ఎంత వరకు అనుసరిస్తున్నారు? ఆ ప్రశ్నను మీకు మీరు వేసుకోండి. మీరు ఆచరించేది లేదుగాని, ఆశించేది అధికంగా ఉంటున్నది. భగవంతుడు చెప్పిన వాక్యాలలో ఏ ఒకటి, రెండు ఆచరణలో పెట్టినప్పటికీ, భగవదనుగ్రహం మీ మీద వర్షిస్తుంది.

## పారాయణ కాదు - ఆచరణ ముఖ్యం

ఈనాడు ప్రపంచంలో భగవద్గీత ప్రచారముగాని, పారాయణగాని అధికంగా జరుగుతున్నది. కాని, ఈ భగవద్గీతలో తెలుపబడిన విషయాలలో ఏ ఒకటి రెండైనా ఆచరించేవారు, అనుసరించేవారు ఉంటున్నారా? ఈనాడు అందరూ ఆశించడంలో హీరోలు—ఆచరించడంలో జీరోలు. రామాయణ గ్రంథాన్ని శిరస్సుపై పెట్టుకొని ఆనందంగా పారాయణ చేస్తున్నారు. కాని, పితృవాక్యపరిపాలన సాగించేవాడొక్కడైనా ఉన్నాడా? ఇంక రామాయణం చదివి ప్రయోజనమేమిటి? రామాయణం గాని, భాగవతం గాని, భగవద్గీత గాని పారాయణ గ్రంథాలేకాదు, ఆచరించవలసిన గ్రంథాలు. బైబిల్, ఖురాను మొదలగు గ్రంథ రాజములు కూడా ఆచరించడానికి యోగ్యమైనవేగాని, కేవలం పఠించుటకు కాదు. కొంతమంది తమ జీవితమంతా తెలుసుకోవడానికే ప్రయత్నిస్తున్నారు. జీవితమంతా తెలుసుకోవడంలోనే వ్యర్థమైతే, ఇక ఆచరించేదెప్పుడు? ఆచరించుటలో ఫలితం ఉన్నది గాని తెలుసుకొనుటలో లేదు.

ఒక 'లైబ్రరీరూమ్'లో లక్షలాది పుస్తకములు ఉండవచ్చును. అయినప్పటికీ, ఆ లక్షలాది పుస్తకములలోని ఏ ఒక్క పదమైనా ఆ లైబ్రరీ రూమునకేమాత్రమైనా తెలుసునా? నేటి మానవుడి పరిస్థితి కూడా ఈ లైబ్రరీరూం మాదిరిగా ఉంటున్నది. ప్రపంచంలో అన్ని విషయాలను అతడు తెలుసుకొంటున్నాడు. అన్ని బోధలు వింటున్నాడు. కాని, ఏ ఒక్కటైనా ఆచరణలో పెట్టుట లేదు. ఆచరణలో పెట్టని విషయాలను ఎన్ని పర్యాయములు వినినప్పటికీ ప్రయోజనం లేదు. కనుక, ఆధ్యాత్మిక మార్గమును అనుసరించెడివారు ఒకటి రెండు విషయాలనైనా ఆచరణలో పెట్టాలి, అప్పుడే ఆనందాన్ని అనుభవించగలరు. అప్పుడే అనుభవించిన ఆనందాన్ని పదిమందికి పంచగలరు. ఇదే ఈనాడు మనము తెలుసుకొనవలసిన ప్రధానమైన తత్త్వం.

## నోటితో నామస్మరణ - చేతితో సేవ

భగవంతునిపై గల భక్తివిశ్వాసములను పరోపకార సంబంధమైన కార్యాలలో ప్రవేశ పెట్టుట చాలా ఉత్తమమైన మార్గము. ఇదే హనుమంతుడు విభీషణునికి ఒకసారి చెప్పినాడు. ఒకసారి విభీషణుడు హనుమంతునితో— "హనుమంతా! నేను చిరకాలము నుండి రామనామ స్మరణ చేస్తున్నాను. రామచింతన తప్ప అన్య చింతన లేదు. అయినప్పటికీ నాకింకా రామానుగ్రహం కలుగుట లేదు. రామదర్శనం నాకు ప్రాప్తించుట లేదు" అన్నాడు. హనుమంతుడు చంచలత్వానికి పుట్టినిల్లు, పెట్టినది పేరు. అట్టి హనుమంతుడు కూడా తన చక్కని సూక్తైన మాటలను విభీషణుని హృదయానికి నాటాడు. "విభీషణా! నీవు రామ చింతన చేస్తున్నావే గాని, రామకార్యంలో ఎంత వరకు పాల్గొంటున్నావు? దైవ చింతన చేసినంత మాత్రమున చాలదు, దైవకార్యాలలో ప్రవేశించాలి. దీనికి ప్రత్యక్షనిదర్శనం నేనే. రామనామము నా హృదయంలో ఉన్నది. కాని, 'రామాజ్ఞ' నాకు ప్రధానము. రామ కార్యాన్ని నా చేతులతో చేయాలి. అప్పుడే నాకు తృప్తి కలుగుతుంది. తట్టలోని పదార్థం పొట్టలోనికి పోవాలంటే— చేతికి, నోటికి పని పెట్టాలి కదా! కనుక, నోటితో నామస్మరణచేయాలి. చేతితో సేవలను ఆచరించాలి. ఈ రెండింటిని చేసినప్పుడే— నీకు రామదర్శనము ప్రాప్తిస్తుంది" అని అన్నాడు.

## సంపాదించిన ధనం సద్వినియోగం కావాలి

ధనమును ఎంతైనా సంపాదించవచ్చు. అయితే, సంపాదించిన ధనాన్ని సద్వినియోగ పరచినప్పుడే, ఆ ధనమునకు కూడా తగిన గౌరవము లభిస్తుంది. అంతేగాని, సంపాదించిన ధనాన్ని ఏ విదేశ బ్యాంకుల్లోనో పెట్టి, కట్టకడపటికి కన్నుమూసుకొని వెడుతున్నారు. మనము పీల్చుకొన్న గాలిని వదలినప్పుడే, ఆరోగ్యం చక్కగా ఉంటుంది. భుజించిన ఆహారాన్ని మరొకవైపు విసర్జించకుండా ఉన్నప్పుడు ఆరోగ్యం చెడిపోతుంది. అదే విధంగా సంపాదించిన ధనమును సద్వినియోగ పరచినప్పుడే తగిన సార్థకత చేకూరుతుంది.

ధనాన్ని ఒక చేతితో సంపాదించాలి, మరొక చేతితో త్యాగం చేయాలి. పూర్వం పారిస్‌లో ఒక వృద్ధ స్త్రీ ఉండేది. ఆమె చాలా బీద స్త్రీ అయినప్పటికీ, తాను సంపాదించిన ధనంతో రెండు, మూడు దుప్పట్లుకొని, రాత్రి పూట చలిలో నిద్రించుచున్న వారిమీద కప్పేసి వచ్చేది. క్రమక్రమేణా ఆమె త్యాగగుణము చేత, ఆమెపై భగవదనుగ్రహం కూడా అభివృద్ధి అయినది. భగవదనుగ్రహము పెరిగే కొలది ఆమె త్యాగం కూడా పెరుగుతూ వచ్చినది. ఆమె బండిలో కొన్ని దుప్పట్లు వేసుకొని, అందరూ నిద్రపోయిన తరువాత, చలిలో నిద్రిస్తున్న వారిపైన కప్పి వచ్చేది. ఈ విషయాన్ని ఎవ్వరికీ చెప్పేది కాదు. కాని, జనులంతా ఆమె త్యాగాన్ని గుర్తించారు. అయితే, ఆమె ఎప్పుడూ తల క్రిందకు వంచుకొని నడిచేది. అందుచేత అందరూ ఆమెను ప్రశ్నించేవారు—"అవ్వా! మీరింత త్యాగం చేస్తున్నారు కదా! మీకెందుకింత సిగ్గు? తల ఎత్తుకొని తిరుగ కూడదా?" అన్నారు. అప్పుడీ వృద్ధురాలు ఈ రీతిగా సమాధానమిచ్చింది—"నాయనలారా! నాకు తల ఎత్తుకొని తిరగటం చాలా అవమానకరంగావుంది. ఎందుచేతనంటే, భగవంతుడు నాకు సహస్ర చేతులతో అందిస్తుంటే- నేను మాత్రము ఒక్క చేతితో దానము చేస్తున్నాను. భగవంతుడు నాకు అనంత హస్తాలతో అందిస్తున్నప్పుడు- నేను ఒక హస్తంతోనే ఇతరులకు దానంచేయుట చాలా అవమానకరంగావుంది".

ఈనాటివారు ఎవరైనా పదిమందికి దానంచేస్తే, ఆ విషయం నా తలంత అక్షరాలతో పేపర్లో మొట్టమొదట ప్రకటింపబడాలని ఆశిస్తారు. ఇటువంటి ప్రచారాన్ని ఆమె ఏమాత్రం ఆశించ లేదు. దీనినే "గుప్తదానం" అంటారు. ఇట్టి దానం చేసేవారు భారతదేశములో కోట్లకొలది ఉంటున్నారు. "జగతియందు పుణ్యపురుషులు లేకున్న—జగములెట్లు వెలుగు?". కనుక, సంపాదించిన ధనాన్ని పదిమందికి దానం చేసి, మంచి కార్యాలలో ప్రవేశించాలి. కార్యదీక్షలో మీరు ప్రవేశించండి. సంఘసేవను దినదినాభివృద్ధి గావించండి. "జనసేవయే—జనార్ధనసేవగా భావించండి. పరులసేవయే— పరమాత్మ సేవగా విశ్వసించండి". ఇదే మీరు చేయవలసిన సాధన. ఈ సాధన చేత మీరు ఎంతటి ఆనందాన్నైనా అనుభవించవచ్చు. మన పంచభూతములను పవిత్రంగా అనుభవించండి. అప్పుడే మానవజన్మ సార్థకమౌతుంది. ఇదే మానవత్వము నందున్న గొప్ప విశిష్టత. దీనితోబాటు భగవన్నామాన్ని స్మరించండి.

ఈనాటి "స్వామి జన్మదినోత్సవం" హాయిగా, చల్లగా జరిగిపోతూ వచ్చింది. ఈ చల్లని వాతావరణం భక్తులందరకూ ఒక "ఎయిర్ కండిషన్"గా తయారైంది. మీ హృదయాలు, భావాలు కూడా చల్లగా ఉండి- ఈ భావాలతో చేరిన చర్యలు కూడా చల్లగా ఉంటుండి, మీరంతా దేశాన్ని చల్లబరచడానికి ప్రయత్నించాలని నేను ఆశిస్తూ, ఆశీర్వదిస్తూ నా ప్రసంగాన్ని విరమిస్తున్నాను.

—శ్రీవారి దివ్యబోధ

23—11—1991,

విద్యాగిరిస్టేడియం, ప్రశాంతినిలయం.

# మానవతా విలువలే విద్యకు ప్రధానం

" మన భారతదేశం ఖండ ఖండాంతరాల విఖ్యాతినార్జించిన మహనీయులను గన్న మాతృ భూమి, పాశ్చాత్య వీరులను పారదోలి స్వాతంత్ర్యమును పొందిన సమర భూమి. ఈ భరతభూమి పాండిత్యము నందేగాక— సంగీత, సాహిత్య, శాస్త్రీయ విద్యలందు ధీశక్తిని చూపించినటువంటి దివ్యభూమి. విద్యార్థులారా! ఇట్టి భరతభూమి యందు మీరు జన్మించినందులకు ఈ భరతమాత ధర్మభాగ్యమును కాపాడే బాధ్యత మీ పైననే ఆధారపడి ఉన్నది...".

విద్యార్థులారా! విద్యాబోధకులారా! విద్యాభిమానులారా!

తర తరముల నుండి భారతదేశం తన ఆధ్యాత్మిక తత్త్వ ప్రభావంతో అన్ని దేశములకు సుస్థిర శాంతి భద్రతలను చేకూర్చుచున్నది. కనుకనే, నాటి నుండి నేటివరకూ— " లోకాస్సమస్తా స్సుఖినో భవంతు " అనునది హైందవ సాంప్రదాయమునకు ప్రధానమైన లక్షణం. కాలంతో మారక, చరిత్రలో మాయక, ప్రళయములలో తరగక, సృష్టితో పెరగక ఏ సత్య మైతే ఉన్నదో—ఆ సత్యము యొక్క రూపకల్పనయే భారతీయ సంస్కృతి. భారతీయ సంస్కృతి అనుప మానమైనది, అత్యద్భుతమైనది. స్థూలజగత్తునకు, జీవలోకానికి, మానసిక సీమకు, సాంఘికజీవితానికి ఈ సంస్కృతి మూలాధారమై ఉన్నది. సనాతన ధర్మమే ఈ సంస్కృతి యొక్క అంతరాత్మ. కనుక విద్యార్థులు కాపాడవలసినది సత్య ధర్మములనేగాని- దేశమును కాదు. ఆ సత్య ధర్మములే దేశాన్ని కాపాడు తాయి. కనుకనే— " ధర్మోరక్షతి రక్షితః " అని అన్నారు. ఇట్టి పవిత్రమైన, దివ్యమైన సంస్కృతిని ఈనాడు భారతీయులు విస్మరించి, కేవలం అనిత్యమైన విషయాలను విశ్వసించి జీవితంలో అశాంతిని పొందు చున్నారు.

దివ్యమైన మానవ స్వరూప స్వభావాలను విద్యాదర్పణము నందు మాత్రమే మనం చూడగలుగు తాము. సృష్టికే రూపు రేఖలను తీర్చిదిద్దే సత్యమునకు విద్య ప్రధానమైన సూత్రము వంటిది. విద్యార్థులు సాధించవలసినవి మానవతా విలువలు. ఎన్ని విద్యలు నేర్చినప్పటికీ, ఎంతటి విజ్ఞానాన్ని సాధించినప్పటికీ వాటితోపాటు మానవతా విలువలను కూడా మనం పెంచుకోవాలి విద్యార్థులకు కావలసినది తెలివితేటలు కాదు, గుణం అత్యవసరం.

## విద్యయొక్క పరమావధి విజ్ఞానం కాదు

" నేటి ఆధునిక విద్యలు తెలివితేటలను మాత్రమే అభివృద్ధి చేస్తున్నాయి గాని, గుణాన్ని ఏమాత్రము పెంచుట లేదు. గుణం లేకుండా కోటి విద్యలు నేర్చినప్పటికీ ప్రయోజనం లేదు. ఈ గుణమే మానవునికి నిజమైన సౌందర్యం ". కనుక, గుణంతో చేరిన విద్యలే మానవునికి సౌందర్యాన్ని చేకూర్చుతాయి. ఇట్టి విద్యలే మానవునికి గుప్తధనం వంటివి. ఇవే మానవుని కీర్తి ప్రతిష్ఠలకు, సుఖ-శాంతులకు మూలాధారం. ఇట్టి విద్యయే గురువులకు గురువు వంటిది. విదేశములకేగినప్పుడు ఇట్టి విద్యయే నిజమైన బంధువుగా మనకు తోడ్పడుతుంది. రాజులచేత పూజింపబడునది విద్యయే గాని, ధనం కాదు. ఇట్టి పవిత్రమైన విద్యను అభ్యసించని మానవుడు పశువుతో సమానమని శాస్త్రములు బోధిస్తున్నవి. మానవుడు కేవలం విజ్ఞానవంతుడైనంత మాత్రమున చాలదు. విజ్ఞానమే విద్యయొక్క పరమలక్ష్యం కాదు. విద్యతో పాటు వినయం, నిస్స్వార్థం, నిరహంకారం— మున్నగు ప్రధానమైన సూత్రములను విద్యార్థి కలిగి ఉండాలి. వ్యక్తిత్వాన్ని పోషించుకొనే నిమిత్తమై విద్యను మనం వినియోగించుకోవాలి.

ఈనాటి విద్యలు కేవలం కృత్రిమమైన బోధలుగా కనిపించుచున్నవేగాని, వీటిలో చైతన్యంగాని, నైపుణ్యంగాని ఏమాత్రము కనిపించుట లేదు. " విద్య డిగ్రీల కొరకనే వెఱ్ఱితనాన్ని విడనాడి, సేవకావృత్తికై మీరు జంకబోక—దేశ శ్రేయస్సు, సౌభాగ్యమును దృష్టియందుంచుకోవాలి ".

ప్రాచీన కాలంలో గురుకులమందు విద్యాభ్యాసమును ముగించి, గృహస్థాశ్రమములో ప్రవేశించబోయే విద్యార్థులను వారి శ్రేయోభిలాషులైన గురువులు చేరదీసి, వారికి అనేక విధములైన సువాక్యములను ప్రబోధించెడివారు. " సత్యం వద— ధర్మంచర, మాతృదేవోభవ — పితృదేవోభవ ", "సత్యాన్న ప్రమదితవ్యం, ధర్మాన్న ప్రమదితవ్యం" అనే ప్రబోధలను విద్యార్థులకందించేవారు. "నాయనా! నీవు సత్యాన్ని పలుకుట చేత ఎట్టి ప్రమాదములు సంభవించవు, ధర్మాన్ని ఆచరించుట చేత ఎట్టి ప్రమాదములు నిన్ను వెంటాడవు. భారతీయులు సత్య ధర్మములను తమ నేత్రములుగా విశ్వసించినారు. కనుక, నీవు జీవితపర్యంతం ఈ సత్య ధర్మాలను అనుసరించాలి, ఆచరించాలి" అని విద్యార్థులకు వారి గురువులు ప్రబోధిస్తూ వచ్చారు,

## నైతిక విలువల పతనానికి కారణాలు

కాని, అతివేగంగా అభివృద్ధి చెందుతూ వచ్చిన శాస్త్రీయ, పారిశ్రామిక విజ్ఞానముల వలన జగత్తులో అనేక విధములైన మార్పులు సంభవిస్తూవచ్చాయి. ఈ మార్పులు సమాజ నైతిక విలువలను నిలువునా కూలద్రోసినవి. ధార్మిక ప్రమాణములు దిన దినానికి తరిగిపోవుచున్నవి. దీనికి బదులుగా మానవులలో ఆడంబరం, అతిభాషణ పెరిగిపోయినవి. స్వార్థ, స్వప్రయోజనాలపై విద్యార్థులకు మోజు అధికమైపోయింది. సమాజమునందు నైతిక విలువల పతనానికి మూలకారణము ఇదే.

మానవుడు ఎన్ని సిద్ధాంతాలను సాధించినప్పటికీ, ఎంత వైజ్ఞానిక పరిశోధనలు సల్పినప్పటికీ— మానవత్వాన్ని తాను ఎంతవరకు సాధించినాడనే విషయాన్ని గూర్చి ప్రతి వ్యక్తి ఆత్మపరిశీలన చేసుకోవాలి. మానవుడు మానవతా విలువలు కలిగియుండనిచో ఇవన్నీ నిరుపయోగమైనటువంటివే.

ఈనాడు భారతీయులు స్వాతంత్ర్యమును సాధించి 44 సంవత్సరములకు పైబడుచున్నది. పూర్వం మన దేశంలో కేవలం కొద్ది విశ్వవిద్యాలయాలు మాత్రమే ఉండేవి. ఈనాడు చాలా విశ్వవిద్యాలయాలు ఏర్పడినవి. పూర్వం కళాశాలలలో చదివే విద్యార్థుల సంఖ్య చాలా తక్కువగా ఉండినది. కాని, ఈనాడు అనేక మంది విద్యార్థులు ఈ కళాశాలలలో చదువుతున్నారు.

ఈవిధంగా నేడు కళాశాలల సంఖ్య అభివృద్ధి చెందుతున్నది గాని, నేటి విద్య ప్రయోజనము లేనిదిగా రూపొందుచున్నది. ప్రపంచానికి ఉపయోగపడే విద్యలు ఏమాత్రం కనిపించుట లేదు. నేటి విద్యావిధానంలో విద్యార్థుల సంఖ్య పెరిగిపోవుచున్నదేగాని, విద్యావిలువ తరిగిపోవుచున్నది.

ఈ విద్యాసంస్థల, విద్యార్థుల సంఖ్య పెరుగుట మాత్రమే దృష్టియందుంచుకొని, మన నాయకులు భారతదేశంలో విద్య అభివృద్ధి గాంచుచున్నదని తమకు తాము ఆనందిస్తున్నారు. సమాజమునకు ప్రయోజనము లేనటువంటి, దేశాభివృద్ధిని, జాతి సమైక్యతను సాధించలేని విద్యలనెన్ని నేర్చినప్పటికీ ప్రయోజనమేమి?

## జాతిసమైక్యతను సాధించండి

ఈనాడు జాతిసమైక్యత ఏమాత్రం కనిపించుట లేదు. స్వాతంత్ర్యమును సాధించినామే గాని, దురదృష్టవశాత్తు ఐక్యతను సాధించలేకపోతున్నాము. దిన దినానికి మానవులలో ద్వేషం, అసూయ మున్నగు దుర్గుణాలు అధికమౌతున్నాయి. "నేటి మానవులలో పాపభీతి లేని పామరత్వం, దైవప్రీతి లేని దానవత్వం పెరిగిపోతున్నాయి. ఈవిధముగా మానవులలో మానవత్వము అణగిపోవుట చేత విశ్వశాంతికి ముప్పు కలుగుచున్నది". చదివి, వ్రాయనేర్చిన వారందరూ విద్యావంతులగునా? సుజ్ఞానము, సుకృతులు లేని విద్యలు సద్విద్యలగునా? ఈనాడు ఆర్య విద్యలణగిపోయి, దుర్విద్యలు పెరిగిపోతున్నాయి. సత్య ధర్మ సుకృతులన్నీ వికృతిని పొంది, క్షీణించిపోతున్నాయి. ప్రజలలో పవిత్రమైన స్వభావం కానవచ్చుట లేదు. దురాచారములు అధికమైనవి. దీనికంతటికీ మూలకారణం—నేటి మానవులు "దైవప్రీతి, పాపభీతి, సంఘనీతి" కోల్పోవుటయే. కనుక, మానవత్వము మన నడతపై ఆధారపడిఉన్నది

విద్యార్థులారా! భారతదేశంలో ప్రతి అణువు పవిత్రమైనటువంటిది. మీరు భారతదేశమునకు ఎంతో ఋణపడి ఉంటున్నారు. కనుక, మీ సేవలను ఈ భరతమాతకు అందించి, ఆమె అనుగ్రహాన్నిపొంది, మీరు ఆనందాన్ని అనుభవించి, ఆ ఆనందాన్ని పది మందికి పంచడానికి ప్రయత్నించాలి. ఈ విధమైన విశాల భావాన్ని విద్యార్థులు అభివృద్ధి పరచుకోవాలి. మానవునికి భక్తి, విశ్వాసము అత్యవసరం. మానవత్వంలో దివ్యత్వమనేది అగోచరంగా ఉంటున్నది. అగోచరమైన, అవ్యక్తమైన ఈ దివ్యత్వాన్ని వ్యక్తీకరణ గావించుకొన్నవాడే నిజమైన వ్యక్తి.

"సద్గుణములు, సద్విద్య, సత్యనిరతి, భక్తి, క్రమశిక్షణ, కర్తవ్యపాలన— మున్నగువాటిని నేర్పునదే నిజమైన విద్య. ఇట్టి విద్యనే విద్యార్థి నేర్వవలయును".

విద్యార్థులకు క్రమశిక్షణ అత్యవసరము. ఈనాటి విద్యార్థులే భావిభారతోద్ధారకులు. అట్టి ఆదర్శప్రాయులుగా తయారు కావలసిన విద్యార్థులు ఈనాడు ఎట్టి మార్గమును అనుసరిస్తున్నారో మీరు యోచించాలి. మీరు దేశాభిమానాన్ని కల్గియుండి, దేశాభివృద్ధిని దృష్టియందుంచుకోవాలి. నేడు విద్యార్థులు కేవలం సుఖం, శాంతి ఈ రెండింటిని లక్ష్యము నందుంచుకొని విద్యనభ్యసించడానికి ప్రయత్నిస్తున్నారు. కాని, సుఖము అనగా ఏమిటో విద్యార్థులకు తెలియుట లేదు. కేవలం తిని, నిద్రించి హాయిగా రోజులు గడుపుకొనుటయే ఒక సుఖమని భావిస్తున్నారు. ఇది ఒక విధమైన అజ్ఞానమే.

ఈ మాత్రం సుఖాన్ని అనుభవించుటకైతే మానవుడుగానే పుట్టవలెనా? కాదు, కాదు. పశు పక్షి మృగాదులు కూడా ఇట్టి సుఖాన్ని అనుభవిస్తున్నాయి కదా! ఈవిధంగా మానవుడు సుఖాన్ని, భోగభాగ్యాలను అనుభవించాలని ఆశించడమనేది నిజంగా ఒక రోగంతో సమానమే. ఈ సుఖము కేవలం వస్తువుల ద్వారా లభ్యము కాదు. నిజమైన సుఖము ఇంద్రియ నిగ్రహం, ఆత్మజ్ఞానం, ఆత్మానందము

నందే లభిస్తుంది. కనుక, విద్యార్థులు మొట్టమొదట ఇంద్రియ నిగ్రహాన్ని అలవరచుకోవాలి. ఇంద్రియ నిగ్రహము కలిగియున్న విద్యార్థికే సరస్వతీ అనుగ్రహము ప్రాప్తిస్తుంది.

## లక్ష్మీనిలయాలుగా మారుతున్న విద్యాలయాలు

ఈనాడు సరస్వతీ మందిరములుగా వెలుగొందవలసిన విద్యాసంస్థలన్నీ లక్ష్మీ మందిరములుగా తయారైనవి. ప్రతిచోట "అడ్మిషన్"కు డబ్బు కట్టాలి. చివరకు మంచి మార్కులు పొందుట కోసం, ఉత్తీర్ణత సాధించుట కోసం కూడా డబ్బు చెల్లించవలసి వస్తోంది. ఈ విధంగా లక్ష్మితో సంబంధం పెట్టుకోవడం చేతనే ఆమె కోడలైన సరస్వతి అడవుల పాలై పోయింది. ఇది మీకు తెలిసిన విషయమే- భారతదేశంలో సాధారణంగా అత్తా - కోడళ్ళకు పొత్తు కుదరదు. అత్త ఉంటే కోడలుండదు, కోడలుంటే అత్త ఉండదు. ఒకవేళ ఏదో అదృష్టవశాత్తు ఇద్దరూ కలసి ఉంటే, ఇంక ప్రతిదినం "కొరియాయుద్ధం" జరుగుతూ ఉంటుంది. ఈనాడు సరస్వతీ మందిరాలైన విద్యా సంస్థలలో లక్ష్మీదేవి వచ్చికూర్చున్నది.

మన భారతదేశములో ఏనాడైతే అన్న విక్రయం, విద్యావిక్రయం, వైద్యవిక్రయం ప్రారంభమైనవో, ఆనాడే మన దేశ పవిత్రత అంతయూ నిర్మూలమై పోయింది. విద్యను అమ్మకోరాదు. ఈనాడు "నీవు ఏమి చేస్తున్నావు?" అని ఏ విద్యార్థినైనా ప్రశ్నిస్తే, "నేను చదువు-కొంటున్నాను" అని సమాధానం చెపుతున్నాడు ఎప్పుడో 10 సంవత్సరములకు పుట్టబోయే బిడ్డకు కూడా కాన్వెంట్‌లో సీటుకై ఇప్పటి నుండియే బుక్ చేసుకొంటున్నారు. మన దేశంలో ఇట్టి దురవస్థ ప్రారంభమైనది. కనుక, అధ్యాపకులు ఈ విషయాన్ని దృష్టియందుంచుకొని, విద్యార్థులకు సర్వకాల, సర్వావస్థలయందు తగిన బోధలు చేయడానికి కంకణం కటుకోవాలి. జీవితం కోసం ఏర్పడిన విద్యను, ఈనాడు జీతాల కోసం ఏర్పడినదని భావిస్తున్నాం. "విద్య జీవితపరమావధికే గాని, జీవించడానికి కాదు". ఇట్టి సత్యాన్ని విద్యావంతులు గుర్తించాలి.

## పరిపూర్ణమానవుడుగా మారాలి

ఈనాడు విద్య నిమిత్తమై గాక, విద్య వలన లభ్యమయ్యే విత్తము నిమిత్తమై విద్యను అభ్యసిస్తున్నారు. "ధనము వస్తుంది, పోతుంది గాని నీతి నియమాలు వస్తాయి, అభివృద్ధి చెందుతాయి." ఈ సత్యాన్ని గుర్తించి, నీతి నిజాయితీలను పెంచుకోవడానికి ప్రయత్నించాలి. మానవతా విలువలను మనం నిలబెట్టుకోవాలి. మానవుడని పిలువబడుతున్నందుకు పేరుకు తగిన సార్థకతను మనం సంపాదించుకోవాలి. అప్పుడే మానవుడు 'పరిపూర్ణ మానవుడు'గా మారగలడు. మానవుని పరిపూర్ణ మానవునిగా మార్చే చైతన్యము విద్యలో ఆవిర్భవించాలి. మానవుని ఆదర్శమానవునిగా మార్చాలి. ఇదే ప్రాచీన కాలము నుండి వస్తున్న మన సంస్కృతి యొక్క ప్రభావము. కాని, ఈనాడు విద్యార్థులలో సంస్కారమనేది మరుగు పడిపోయి, సంసారమనేది అభివృద్ధి చెందుతున్నది.

ఏనాటికైనా మన వెంట వచ్చేది, మన జంట ఉండేది సంస్కారం మాత్రమేగాని, సంసారం కాదు. మన జీవితాన్ని ఆదర్శ జీవితముగా మార్చుకోవాలి. మీ అదృష్టమనేది— మీ నడతపైన ఆధారపడి ఉన్నది. కనుక, మీరు చక్కని నడతను కలిగియుండాలి. మీరు ఈ యూనివర్సిటీ నందు తయారైనందుకు ఆదర్శవంతులుగా మారి, ప్రపంచములో ప్రవేశించి, తగిన శాంతి - భద్రతలను చేకూర్చి, ఆదర్శాన్ని నిరూపిస్తారని నేను ఆశిస్తున్నాను.

శ్రీవారి దివ్యబోధ
22—11—1991,
విద్యాగిరి స్టేడియం, ప్రశాంతినిలయం.

# ఆత్మజ్యోతిని వెలిగించు

" శాంతి అంతరించినది, సత్యమే కరువైనది. ఆయుధముల బాధ అధికమైనది. ఇట్టి అనర్థములన్నింటికీ స్వార్థమే మూలకారణం. సత్యమైన బాట — సాయి మాట ".

" సత్య ధర్మ శాంతి ప్రేమ అహింసలు— మానవునికి పంచప్రాణాల వంటివి ఈ పంచప్రాణములలో ప్రేమ అతిప్రధానమైనది. కనుక, మానవ హృదయంలో ప్రేమను పదిలపరచుకోవాలి ".

ప్రేమ స్వరూపులారా !

భారతీయ సంస్కృతి అనంతమైనది అనుపమానమైనది. భారతీయ పర్వదినములన్నీ అనంతమైన ఆధ్యాత్మిక అంతరార్థాలతో కూడి ఉంటున్నవేగాని, విలాసాల, వినోదాల, ఆడంబరాల నిమిత్తమై ఆవిర్భవించినవి కావు. భారతీయులకు సర్వపదార్థములు పూజనీయములే. కంటికి కనిపించునవి, చెవులకు వినిపించునవి, మనస్సును మరపించునవి, హృదయాన్ని కదిలించునవి— సమస్త పదార్థములూ యదార్థములైనవే.

## భారతీయ సాంఘిక న్యాయం

భారతీయులకు రాయి మొదలుకొని రత్నం వరకు, పక్షి మొదలుకొని పారిజాతము వరకు, చీమ మొదలు కొని ఏనుగు వరకు, పామరుడు మొదలుకొని పరమహంసవరకు—సకల పదార్థాలు పరతత్త్వాన్ని ప్రబోధించునవే. దీనిని పురస్కరించుకొనియే— " సర్వం ఖల్విదం బ్రహ్మ ", " సర్వం విష్ణుమయం జగత్ " " ఈశావాస్య మిదం సర్వం " మొదలగు మహా, వాక్యములు పరమ సత్యాన్ని ప్రబోధిస్తూ వచ్చినవి. భారతీయుల సాంఘిక న్యాయం ఏ ఇతర దేశము లందును కనిపించదు. దైవత్వమును, ప్రేమ తత్త్వమును కేవలం మానవుల వరకు మాత్రమే పరిమితం గావించకుండా, సమస్త జీవుల యందు వ్యాపింపజేసే విశాలతత్త్వం భారతీయులది. ఇట్టి పవిత్రమైన సంస్కృతిని గుర్తించుకొనలేని అజ్ఞానులు భారతీయులను హేళన చేస్తుంటారు. భారతీయులు రాళ్ళను-రప్పలను, వృక్షములను, కొండలను పూజిస్తుంటారని వారు హాస్యాస్పదముగా మాట్లాడుతుంటారు. ఏకత్వము నందు అనేకత్వమును చూడటం మానవ సహజం. కాని, భారతీయుల సంస్కృతి యందు అనేకత్వంలోని ఏకత్వాన్ని గుర్తింపజేసే పరతత్త్వం ఇమిడి ఉంటున్నది.

## చీకటి వెలుగులు

ప్రతి పర్వదినం కూడా మానవుని యందే దివ్యత్వ మున్నదని హెచ్చరించే దివ్యమైన సూచనయే. "ఓ అజ్ఞాన మానవుడా! దివ్యమైన ఆత్మ తత్త్వము నీ యందే ఉండినప్పటికీ దానిని నీవు విస్మరించి, జగత్తును విశ్వసించి మానవత్వమును వ్యర్థం గావించు కొంటున్నావు" అని భారతీయ శాస్త్రములు తెలియ జేస్తున్నాయి.

ఈనాటి పర్వదినము యొక్క పేరునందే దివ్యమైన జ్యోతిస్వరూపం ఇమిడి ఉంటున్నది. "దీపావళి" అనగా దీపముల సమూహము అని అర్థము. ఎక్కడ చీకటిగా ఉన్నదో, అక్కడే వెలుతురు ఆవసరము. కనుకనే— "తమసోమా జ్యోతిర్గమయా" అని అన్నారు. ఏమిటీ చీకటి? దుఃఖం, నష్టం, అశాంతి, నిరాశ, నిరుత్సాహం—ఇవన్నీ చీకటితో పోలినటు వంటివే. దుఃఖమనే 'చీకటి' పోవాలంటే, సుఖ మనే 'దీపాన్ని' వెలిగించాలి. రోగమనే 'చీకటి' పోవాలంటే ఆరోగ్యమనే 'జ్యోతిని' వెలిగించాలి. అయితే, ఈ సుఖ-దుఃఖములు ఒకదానినొకటి సమన్వ యము గావించే సమత్వములే గాని, అన్యములు కావు.

## కౌముది మాసం

ఈ పర్వదినముల అంతరార్థములు ప్రాపంచిక రీతిలో ఒక విధంగా ఉంటాయి, ఆధ్యాత్మిక పరంగా మరొక విధంగా ఉంటాయి. అయితే, ఈ రెండింటి యందు సమత్వమనేది ఇమిడి ఉంటున్నది. దీనిని తెలుసుకోలేని మూర్ఖులు భిన్నత్వాన్ని భావించి నానార్థ ములు కల్పించి, అనర్థములు స్వీకరించి, యదార్థాన్ని విస్మరిస్తున్నారు. ఈ పర్వదినము యొక్క అంత రార్థమును సైన్సు పరంగా పరిశీలించినప్పుడు— పూర్వం భారతీయులు దక్షిణ ధృవ ప్రాంతము నందు జీవించేవారు. ఇక్కడ ఆరు నెలలు చీకటిగా, ఆరు నెలలు వెలుతురుగా ఉంటుంది. "మేషసంక్రాంతి" దినమున సూర్యోదయమౌతుంది, "తులాసంక్రాంతి" దినమున సూర్యాస్తమయమౌతుంది. ఈ మేషమునకు, తులకు మధ్య కాలము ఆరు నెలలు. ఈ ఆరు నెలలు వెలుతురుగానే ఉంటుంది. ఈ ఆరు నెలల తరువాత తులారాశియందు చీకటి ప్రారంభమౌతుంది. ఇది కార్తీకమాస చతుర్దశి, అమావాస్యదినం. ఈ మాసము నకే "కౌముది" అనే పేరు వచ్చింది. ఆనాటి దక్షిణ ధృవ ప్రాంతీయులు ఈ దినము నుండి జ్యోతులు వెలిగించుకొనుట ప్రారంభిస్తూ వచ్చారు. నిరంతరం చీకటి యందే వారు జీవితము గడుపవలసి ఉండుట చేత, ఈ వెలిగించే జ్యోతికి "నిత్యజ్యోతి" అని పేరు పెట్టారు.

## నరకగ్రహ నిర్మూలన

5 వేల సంవత్సరములకు పూర్వము కొన్ని గ్రహములు ఉండేవి. అప్పుడప్పుడు ఈ గ్రహములు వాటంతటకవే అంతమైపోతుంటాయి. ఒకప్పుడు "నరక" అనే గ్రహం చంద్రగ్రహంతో పాటు అతి సమీపంలో సూర్యుని చుట్టూ తిరుగుతూ ఉండేది. కొంత కాలానికి ఈ 'నరక' అనే గ్రహం భూమిని ఢీకొనడానికి సమీపించింది. అప్పుడు భూలోకవాసులు అతి భయము చేత, దిగులు చేత చాలా దుఃఖమును అనుభవించవలసి వచ్చింది, వారందరూ కలసి భగ వంతుని ప్రార్థించారు. ఆ ప్రమాదము నుండి రక్షించి, తమకు ప్రాణభిక్ష పెట్టమని భగవంతుని కోరారు. అప్పుడు కృష్ణుడు తన ప్రజ్ఞాశక్తి చేత ఆ నరక గ్రహమును దునుమాడాడు. శ్రీ కృష్ణుని ప్రజ్ఞా శక్తినే— "సత్యము" అని పిలుస్తూ వచ్చారు. అనగా శ్రీ కృష్ణుడు సత్యాసమేతుడై నరకగ్రహాన్ని నిర్మూలం గావించాడు. అప్పుడు భూలోకవాసులు ఈ కష్టము నుండి తప్పించుకొన్న సందర్భములో ఆనందోత్సాహాలతో జ్యోతులు వెలిగించుకొని, ఆనాడు ఈ పర్వదినమును ఉల్లాసంగా జరుపుకొన్నారు.

## రామజ్యోతి

శ్రీరాముడు రావణుని హతమార్చి అయోధ్య చేరి, పట్టాభిషిక్తుడైన దినమే దీపావళి. రామజ్యోతి అయోధ్యను వదలిన తరువాత అయోధ్య అజ్ఞానమనే చీకటితో నిండిపోయింది. అరణ్యమంతా ప్రకాశంతో నిండిపోయింది. ఈ దుఃఖంలో అయోధ్య మునిగి ఉండుట చేత ఆనాటి ప్రజలు రాముడు అయోధ్యలో ప్రవేశించినంతనే, ఆతనిని ఒక దివ్య జ్యోతిగా భావించి, ఆనందంలో ఈ జ్యోతుల ఉత్సవాన్ని జరుపుకొన్నారు.

## అహంకార నిర్మూలన గావించుకో

వామనుడు బలిచక్రవర్తిని మూడడుగుల నేలను దానమిమ్మని కోరి, ఆతనిని పాతాళలోకమునకు దిగద్రొక్కిన దినమే ఈ దీపావళి దినం. దీనికి మరొక అంతరార్థము ఉంటున్నది. సూర్యుడనగా విష్ణువు అని మరొక పేరు. సూర్యుని రథమునకు ఏడు గుఱ్ఱములున్నవి అంటారు. అనగా ఏడు రంగులే ఏడు గుఱ్ఱములు. ఈ రథమునకు ఒకే చక్రం. ఈ చక్రమునకు 360 ఆకులు ఉంటున్నవి. అవే 360 దినములు. ఈ సూర్యునికి ఉదయము, మధ్యము, అంత్యము అని మూడు స్థితులుంటున్నవి. ఆతడు ఈ మూడు స్థితులనే మూడు పాదములుగా తీసికొని, అహంకారమనే బలిచక్రవర్తిని అణగద్రొక్కాడు. చక్రవర్తి అనగా ఏమిటి? అందరికీ నాయకుడని, అందరు అతని స్వాధీనములో నిల్చినవారని అర్థము. మానవుని యందు కూడా ఒక 'చక్రవర్తి' ఉంటున్నాడు. మిగిలిన సకల సద్గుణములు అతని స్వాధీనము నందే ఉంటున్నాయి. అతడే— "అహంకారచక్రవర్తి". కనుకనే, సకల సద్గుణములను ఈ అహంకారమనే 'చక్రవర్తి' అణచి వేస్తున్నాడు. అహంకారమునకు మరొక అర్థమేమనగా దేహమునే—"నేను" అని భ్రమించుట. దేహం నీవు కాదు. ఈ దేహం కేవలం ఒక పనిముట్టువంటిది. ఇది కేవలం పదార్థముల చేరికనే. ఈ జడమైన దేహమునందు ఒక చైతన్య శక్తి చేరియుండుటచేత, ఇది అన్ని విధములైన క్రియలలో ప్రవేశిస్తున్నది. కనుక, ఇట్టి దేహమునే 'నేను' అని భావించుటయే—అహంకారం. ఈ అహంకారంతో కూడియున్న మానవుడు అజ్ఞానమనే అంధకారములో మునిగియుంటాడు. ఈ అహంకారమనే అజ్ఞానం దూరమైనప్పుడు, దివ్యజ్ఞానమనే ప్రకాశవంతమైన జ్యోతి వెలిగింపబడుతుంది. ఈ అహంకారం అణగద్రొక్కబడిన దినమే దీపావళి దినము.

## బాహ్యజ్యోతి — అంతర్ జ్యోతి

విక్రమచక్రవర్తి భారతదేశమును పరిపాలించిన మొదటి దినమే ఈ దీపావళి దినము. ఈ విధమైన అనేక విషయాలను పురస్కరించుకొని భారతీయులు ఈ దీపావళి పర్వదినమును బాలురు మొదలుకొని, వృద్ధుల వరకు ఎంతో ఆనందోత్సాహములతో అనుభవిస్తూ వచ్చారు. అయితే, ఈ దీపములు కేవలము బాహ్యమైన చీకటిని మాత్రమే దూరము గావిస్తాయి. కాని, ఆంతరంగికమైన చీకటిని ఏమాత్రం నిర్మూలం గావించలేవు. ఒక్క "జ్ఞానజ్యోతి" మాత్రమే ఆంతరంగికమైన చీకటిని నిర్మూలం గావించగలదు.

జ్యోతిని మనం వెలిగించాలంటే, ఒక ప్రమిద కావాలి. దానిలోపల తైలం పోయాలి. దానిలో ఒక వత్తిని పెట్టాలి. దీపం వెలిగించేందుకు ఒక నిప్పుపెట్టె కూడా ఉండాలి. కనుక ప్రమిద, నూనె, వత్తి, నిప్పుపెట్టె—ఈ నాలుగు ఉండినప్పుడే మనం జ్యోతిని వెలిగించగలం. ఈ జ్యోతి బాహ్యమైన చీకటిని దూరం గావిస్తుంది. వత్తి వెలిగే కొలది తైలం కూడా తరిగిపోతుంది. ఈ తైలం అయిపోయేటప్పటికి, వత్తి కూడా నిలిచిపోతుంది. దీనినే రామదాసు చెప్పాడు—

"సారమైనది చమురురా! సత్యమైనది
వత్తిరా! వెలుగు తీరిపోయేటప్పుడు, వెంట

ఎవ్వరు రారురా!" ఈ వెలుగు పోయేటప్పుడు
దాని వెంట వత్తిగాని, తైలము గాని వెళ్ళవు

అట్లే, మన అంతరంగమందుగల చీకటిని దూరం గావించుకోవాలంటే, దానికి ఒక ప్రమిద, వత్తి, నూనె, అగ్గిపెట్టె కావాలి. మన హృదయమే— ఒక ప్రమిద. మన మనస్సే—వత్తి, ప్రేమయే— తైలం, వైరాగ్యమే—నిప్పుపెట్టె, ఈ నాలుగు చేరినప్పుడే—"ఆత్మ జ్యోతి" ప్రకాశిస్తుంది. అప్పుడే- "అజ్ఞానమ"నే అంధకారం దూరమౌతుంది.

ఈ జ్యోతికి రెండు గుణములుంటున్నాయి. ఒకటి: చీకటిని దూరం చేయుట, రెండవది: నిరంతరము ఊర్ధ్వ గతికే ప్రయాణం చేయుట. జ్యోతిని గుంతలో పెట్టినప్పటికీ దాని ప్రకాశం పైకే వస్తుంది గాని, క్రిందకు పోదు. కనుకనే దీనిని "ఊర్ధ్వమూలమును చూపే పవిత్రమైన జ్యోతి" అని ఋషులు వర్ణిస్తూ వచ్చారు. కనుక, బాహ్య జ్యోతితో పాటు అంతర్జ్యోతిని కూడా అభివృద్ధి గావించుకొనుటకు ప్రయత్నించాలి.

## ఆధ్యాత్మిక జ్యోతి

మానవత్వమునకు త్రికరణ శుద్ధి అత్యంత ప్రధానమైనది. దీనివలన మన యందు ఒక దివ్యమైన తేజస్సు ఆవిర్భవిస్తుంది. త్రికరణశుద్ధి కలిగిన మానవుని యందు ఏమాత్రం భయంగాని, ఆందోళనగాని ప్రవేశించవు. కనుక, అతనికి ఏ విధమైన రక్షణ కూడా అవసరము లేదు. ఎక్కడ తప్పో అక్కడ భయం, ఎక్కడ భయమో అక్కడ రక్షణ కావాలి లోకంలో అనేకమంది సెక్యూరిటీని (రక్షణ) ఏర్పాటు చేసుకొంటున్నారు. సెక్యూరిటీ ఎందుకోసం? భయం ఉండుట చేత సెక్యూరిటీ అవసరం కలుగుతుంది. ఈ భయం ఎందుచేత ఏర్పడుతుంది? తప్పు చేయుట వలన భయం కలుగుతుంది. తప్పు చేయని వానికి భయమే లేదు, భయం లేనివానికి రక్షణ అవసరంలేదు. మానవుడు దోషమయుడై ఉండుటచేత, నిరంతరము భయంతో క్రుంగిపోతున్నాడు. ఈ దోషములను దూరం గావించుకొన్నప్పుడు, భయం కూడా మన నుండి దూరమౌతుంది. ముందు ముందైనా ఈ దోషాలలో ప్రవేశించకుండా ఉండుటకు ప్రయత్నించాలి. నిర్విరామ కృషితో, నిరంతర తాపత్రయంతో, అంతులేని ఆశలతో, అర్థం కాని ఆవేదనతో అప్రాప్య ప్రాప్తికై ప్రాకులాడే మానవుని యందు నిత్య సత్యమైన జ్యోతిని వెలిగించునదే—"ఆధ్యాత్మికజ్యోతి". ఇదే మానవునికి ఒక దివ్యమైన "లైట్ హౌస్" వంటిది. సంసారమనెడు నావ నెక్కి సంచారము చేసే ప్రతి మానవునికి ఈ దివ్యజ్యోతి అనేది అత్యవసరము. చక్కని దిక్కును చూపే ఈ దివ్యమైన

ఈ లోకంలో ప్రతి మానవుడు ఎన్ని పదవుల నేలినప్పటికిని, ఎన్ని సిరిసంపదలను సంపాదించినప్పటికిని నిజమైన శాంతి భద్రతలను పొందుట లేదు. ఈనాటి మానవుడు అన్నింటిని విశ్వసిస్తున్నాడు గాని, ఆత్మను విశ్వసించుట లేదు. ఆత్మవిశ్వాసము కోల్పోవుట చేతనే భారతదేశం ఇన్ని అవస్థలకు గురియౌతున్నది. ఒక చిన్న ఉదాహరణ: ఈనాడు మంగళవారం అనుకుంటున్నాం. అయితే, ఈరోజు మంగళవారమని ఎవరు నిర్ణయించారు? తెల్లవారిలేచిన తక్షణమే ఈరోజు "మంగళవారం అని బోర్డు కట్టుకొని వచ్చిందా? కాదు, కాదు. క్యాలెండరు బట్టి ఈనాడు మంగళవారం అనుకొంటున్నాము. ఈ క్యాలెండర్‌ను ఎవరు నిర్ణయించారు? ఒక జోతిష్యశాస్త్ర సిద్ధాంతి నిర్ణయించాడు. ఆ సిద్ధాంతి నిర్ణయించిన విషయాలనే మనం విశ్వసిస్తున్నాము. ఈ జోతిష్యశాస్త్రము ఎక్కడి నుండి వచ్చింది? ఇది "మనుశాస్త్రము" నుండియే ప్రారంభమైనది. అయితే, ఇట్టి మనుశాస్త్రమును ఎవ్వరూ విశ్వసించుట లేదు గాని, జోతిష్య శాస్త్రమును మాత్రము విశ్వసిస్తున్నారు. ఆదిని వదలి మధ్యను ఆధారంగా పట్టుకొనుట చేత అనేక విధాలైన పాట్లు పడుతున్నారు.

## మానవజీవితం అర్థ, కామాల కోసం కాదు

పురుషార్థములు నాలుగు: ధర్మార్థ కామ మోక్షములు. వీటిలో మొదటిది ధర్మం, కడపటిది మోక్షం. నేటి మానవులు ఈ రెండింటిని విస్మరించి, మధ్యనున్న అర్థ, కామాల కొరకు మాత్రమే అఱ్ఱులు చాస్తున్నారు. అందుచేత, ఈనాటి మానవుని జీవితం "తల—తోక" లేని బ్రతుకుగా ఉంటున్నది. జీవితమంటే ఏమిటి? ఏదో అన్న పానాదుల నిమిత్తమై జీవితము వచ్చినదని భావిస్తున్నాము. కాదు, కాదు. జీవితం చాలా విలువైనది, పవిత్రమైనది. మన నిత్య సత్యమైన ఆత్మతత్త్వాన్ని ప్రకటింప జేసే నిమిత్తమై జీవితం వచ్చింది. మానవుడు తాను తరించే నిమిత్తమై తనువును ధరించాడు గాని, ప్రపంచాన్ని వరించే నిమిత్తమై కాదు. ఆదర్శవంతమైన జీవితాన్ని అనుభవించాలి.

## ఆనంద, సంతోషాల వ్యత్యాసం

ఈనాడు మనం ఆనందం కావాలని ఆశిస్తున్నాము. ఎట్టి ఆనందము? ఇది తాత్కాలికమైనదా? ఇది తాత్కాలికమైనదైతే "ఆనందము" అని పిలువబడదు. శాశ్వతమైన సుఖాన్ని పొందినప్పుడు కలిగేది ఆనందము. తాత్కాలిక సుఖాన్ని పొందినప్పుడు కలిగేది సంతోషం. అందుచేతనే దీనిని "సమ్(some)-తోషం" అంటున్నాము. సమ్—అనగా 'కొంచెం' అని అర్థము. ఇట్టి తాత్కాలికమైన దానిని శాశ్వతమైనదిగా భ్రమించి మనం అందులో మునిగిపోతున్నాం. ఇదే మనలో ఉన్నటువంటి దోషం. ఆనందమనగా- Bliss, సంతోషమనగా- Happiness. ఈ రెండింటి మధ్య చాలా వ్యత్యాసమున్నది. Happiness అనేది అప్పటికప్పుడు మాత్రమే తృప్తినిస్తుంది. దీనికొక ఉదాహరణ: నీకు ఆకలౌతున్నది. నీవు క్యాంటీన్‌కు వెళ్ళి రెండు చపాతీలు తింటే తృప్తిని, సంతోషాన్ని పొందుతావు. అయితే, ఈ సంతోషం ఎంతసేపు నిలుస్తుంది? రెండు గంటలు మాత్రమే నిలుస్తుంది. తరువాత మరల ఆకలి ప్రారంభమౌతుంది. కనుక, తాత్కాలికమైన ఇట్టి సంతోషాన్ని కోరుకొనుట మానవ జీవిత లక్ష్యము కాదు. శాశ్వతమైనటువంటి సచ్చిదానందమును కోరుకోవాలి.

## త్రిగుణాత్మకమైన తత్త్వం

సత్ - చిత్ - ఆనందము ఈ మూడు వేరు వేరు కాదు. దీనికొక ఉదాహరణ: అగ్నికి మూడు గుణములుంటున్నాయి, ఒకటి: ఎఱ్ఱని రంగు, రెండవది: ప్రకాశము, మూడవది: కాల్చేశక్తి. అయితే, ఈ మూడు వేరు వేరు కాదు. ఒకదాని యందే ఈ మూడు చేరి ఉంటున్నాయి. అట్లే, మానవుని యందు సత్వరజస్తమో గుణాలు మూడు ఇమిడి ఉంటున్నవి. ఇవి మూడు రకములైన సన్నివేశములలో వ్యక్తమౌతుంటాయి. కాని, ఈ మూడు ఒకరి యందే ఉంటున్నాయి. అనగా ఏమిటి? నిత్యత్వమును ప్రకటించే సమయములో "సత్" నిరూపిస్తుంది, పరిపూర్ణత్వాన్ని ప్రకటించే సమయములో "చిత్" నిరూపిస్తుంది. ఈ రెండింటి కలయికయే—"ఆనందము". ఏ రుచి లేని నీటిలోపల తీయని చక్కెర కలిపినప్పుడు లభించేది చక్కెర కాదు, నీరు కాదు, పానకము లభిస్తుంది. అట్లే, సత్-చిత్ రెండు కలిసినప్పుడు ఆనందము ఆవిర్భవిస్తుంది. కనుకనే, మానవుడు ఆనందమయుడు, ఆనందపిపాసి. ఏ పని చేసినా ఆనందము కావాలని ఆశిస్తున్నాడు అయితే, ఈ ఆనందము తేలికగా లభించేది కాదు. మానవుడు తన తత్త్వాన్ని తాను గుర్తించినప్పుడే ఆనందం లభిస్తుంది.

## నీలోనున్న జ్యోతిని వెలిగించు

ఈ దీపావళి అంతరార్థమేమిటంటే, మానవుడు క్షణక్షణం విచారమనే 'చీకటి'లో మునుగుతున్నాడు. చీకటిలో ప్రవేశించినప్పుడు జ్యోతిని వెలిగించుకోవాలి. నీవు నిరంతరము నీలో ఉన్న జ్యోతిని వెలిగించుకోవాలి. నీవు ఎక్కడికి వెళ్ళినా నీలోని ఆ

జ్యోతియే నీకు దారి చూపిస్తుంది. ఒక చిన్న ఉదాహరణ: ఒక "హరికెన్‌లాంతరు" వెలుతురు పదిగజాల వరకు ప్రసరిస్తుంది. ఆ లాంతరును ఒక చోటపెట్టి, చీకటిలో నీవు 10 మైళ్ళు ప్రయాణం చేయుట సాధ్యం కాదు. కాబట్టి నీతోపాటుగా ఆ లాంతరును కూడా ప్రయాణము చేయించాలి. అప్పుడెంత దూరమైనా ప్రయాణము చేయగలవు. అదేవిధముగా నీ యందుండిన భగవద్విశ్వాసాన్ని నీతో పాటుగా ప్రయాణము చేయించాలి.

మానవత్వము ఎందుకోసం ప్రాప్తించింది? కేవలం పశు పక్షి మృగాదుల వలె జీవితాన్ని అనుభవించుటకు కాదు. మనము ఎందుకోసం చదువుతున్నాము? ఎందుకోసం ఉన్నతస్థితికి పోవాలని ఆశిస్తున్నాము? ఒక ఆదర్శము నందించేందుకే. మనము ఆనందమును అనుభవించి, పదిమందికి పంచి జగత్తుకు అందించాలి. ఇదే ఆదర్శము. విద్యార్థులు ముఖ్యంగా ఈ విషయాన్ని గుర్తించాలి. కేవలము స్వార్థ స్వప్రయోజనములకై పాకులాడ కూడదు, హృదయాన్ని విశాలము గావించుకోవాలి. అదే నిజమైన ప్రేమ. మన ప్రేమ సంకుచితమైనదిగా ఉండకూడదు, విశాలమైనదిగా ఉండాలి. ఆ ప్రేమ తత్త్వమే దివ్యత్వము. ఆ ప్రేమజ్యోతిని వెలిగించుకుంటే మనం ఆనందాన్ని పొందవచ్చును. నీవు ప్రేమికుడవు కాకూడదు. నీవే ప్రేమగా మారాలి. నీవు ప్రేమికుడవైతే ఒకరినో, ఇద్దరినో ప్రేమించవచ్చును. కాని, నీవే ప్రేమవైతే ఈ జగత్తునంతా ప్రేమించవచ్చును. కనుక, నీవు ప్రేమమయుడివి కావాలి. అహంకారమనే అజ్ఞానాన్ని దూరం చేసుకోవాలి. ఈ అహంకారమే అన్ని విధములైన అశాంతికి మూలకారణం. ఆనందాన్ని పొందాలనుకుంటే ప్రేమలో మునిగిపోవాలి, ప్రేమజ్యోతిని వెలిగించుకోవాలి.

—శ్రీవారి దివ్యబోధ,
5—11—1991,
ప్రశాంతినిలయం.

# శ్రీ సత్యసాయి మహోన్నత వైద్యాలయ ప్రారంభోత్సవం

"ఈ హాస్పిటల్ ప్రారంభోత్సవము— చేయవలసిన తేదిని కూడా అప్పుడే నిర్ణయించుకొన్నాము. 91 నవంబరు 22వ తేదిన దీనికి ప్రారంభోత్సవం చేస్తాము" అని క్రిందటి సంవత్సరం లక్షలాది భక్తుల సమక్షంలో భగవాన్ బాబావారు తమ 65వ జన్మదినోత్సవ సందేశంలో ప్రకటించిన విషయము అక్షరాలా నిజమైనది. ఆ ప్రేమావతారుని మాట రూపు తొడిగింది— నవంబరు 22, 1991 నాడు ఉదయం 9-30 గం॥లకు భగవానుని దివ్యసమక్షంలో భారత ప్రధాని శ్రీ పి. వి. నరసింహారావుగారిచే "శ్రీ సత్యసాయి ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హైయర్ మెడికల్ సైన్సెస్" ప్రారంభోత్సవం జరిగింది.

విద్యాగిరి పరిసర ప్రాంతంలోని "శ్రీ సత్యసాయి జనరల్ హాస్పిటల్"కు అనుబంధంగా నిర్మించబడిన 100 పడకల వసతి గల నూతన భవంతుల ప్రారంభోత్సవం స్వామివారి సమక్షములో ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ యన్. జనార్దన్ రెడ్డిగారిచే అదే రోజు ఉదయము 8 గంటలకు జరుపబడింది. పిమ్మట, బాబావారు అట నుండి నేరుగా మహోన్నత వైద్యాలయ ప్రారంభోత్సవానికై బయలుదేరినారు.

భారత ప్రధాని రాక సందర్భంగా చేయబడిన కొన్ని భద్రతా ఏర్పాట్ల కారణంగా కేవలము కొంత మంది ప్రముఖులు మాత్రమే ఈ ప్రారంభోత్సవానికి ఆహ్వానింపబడినారు. సత్యసాయి విద్యాసంస్థల విద్యా

ర్థులు, ఆహ్వానితులందరూ ముందుగానే హాస్పిటల్‌ను చేరుకొని, భగవాన్ బాబావారి రాకకై వేచి ఉండిరి. బాబావారు హాస్పిటల్ చేరుకొని, అక్కడ వేచియున్న వారందరికీ తమ దివ్యదర్శనభాగ్యాన్ని అనుగ్రహించి, ప్రారంభోత్సవానికై చేయబడిన ఏర్పాట్లను పర్యవేక్షించారు. కొంతసేపటికి హాస్పిటల్‌ను చేరుకొన్న ప్రధానమంత్రిని "పూర్ణకుంభం" తో 300 మంది విద్యార్థులు వేదమంత్ర పఠనం గావిస్తూ ఆహ్వానించారు. ప్రధాని సరాసరి బాబావారి చెంతకేగి సవినయంగా తన ప్రణామములనర్పించారు.

తదుపరి వారిరువురు అక్కడ పరచబడియున్న ఎఱ్ఱని తివాసిపై నడచుకొంటూ వెళ్ళి హాస్పిటల్ సింహద్వారాన్ని చేరుకొన్నారు. అక్కడ రిబ్బన్ కత్తిరించి లోనికి ప్రవేశించారు. వివిధ దేవతల ప్రతిమలతో, ఎత్తైన రంగు రంగుల గోపురముతో కూడియున్న సువిశాలమైన ఆ షడ్భుజాకార హాలు యొక్క సౌందర్యాన్ని తిలకించి ప్రధానమంత్రి, తదితరులు సంభ్రమాశ్చర్యములలో తేలియాడినారు. రోగపీడితులైన వారికి ఆ దేవతా విగ్రహాలు తిలకించుట చేత కన్నులకానందము, భక్తి ప్రపత్తులను కల్గించి, భగవన్నామ స్మరణ అప్రయత్నముగ చేయుటకెంతేని దోహదములుగా కన్పట్టుచున్నవి. వైద్యాలయమే ఒక దేవాలయంగా తయారైంది. ఇటు మానసిక, ఆధ్యాత్మిక చికిత్స, మరి అటు భౌతిక రోగ రుగ్మతలను మాన్పుటకు చికిత్స— ఈ రెండునూ ఏకకాలంలోనే జరుగుటకు వసతిగ నున్నది. గోపురము నుండి వ్రేలాడదీయబడిన అద్భుతమైన "ఛాండిలియర్" అందరి దృష్టిని ఆకర్షించినది. 30 అడుగుల ఎత్తుగల ఈ "ఛాండిలియర్" ఇటలీదేశం నుండి తెప్పించబడినది.

పిమ్మట ప్రధానమంత్రి సర్వసన్నద్ధమైయున్న "కార్డియోలజీ" (హృద్రోగచికిత్స) విభాగాన్ని సందర్శించారు. హాస్పిటల్ ప్రారంభోత్సవం జరిగిన 15 ది॥లలో మొదటి గుండె ఆపరేషన్ జరిగింది. అదే రోజున మొత్తం నాలుగు శస్త్రచికిత్సలు విజయవంతంగా జరిగాయి.

ఈ హాస్పిటల్‌లో ఎన్నో కోట్ల రూపాయల వ్యయంతో అత్యంత అద్భుతమైన అధునాతనమైన వివిధ వైద్య యంత్ర పరికరాలు అమర్చబడినవి. ఈ ఈ వైద్య పరికరాల గురించి బాబావారు తమ జన్మదినోత్సవ సందేశంలో మాట్లాడుతూ— "ఇటువంటి ఆధునిక యంత్రములు ఇంకా ఎక్కడా ప్రారంభము కాలేదు. ఇవి ఎటువంటివంటే—ఒక యంత్రంలోపల నిలబడితే, మన దేహంలో ఉన్న దోషములన్నింటిని రెండు నిమిషాలలో తెలియజేస్తుంది" అన్నారు. విదేశాల నుండి తెప్పించబడిన ఈ పరికరాలపై భారతదేశ ప్రభుత్వం పన్ను రద్దు చేసి, ఈ బృహత్ కార్యానికి తోడ్పడింది. 'ఎయిర్ ఇండియా' విమాన సర్వీసుల వారు వివిధ దేశాల నుండి ఈ హాస్పిటల్ కొరకై యంత్రపరికరాలను ఉచితంగా రవాణా చేసారు.

అత్యవసర పరిస్థితిలో రోగులను దూరప్రాంతాల నుండి కాలాయాపన జరుగకుండా తరలించడానికి వీలుగా హాస్పిటల్‌కు అతి సమీపంగా "శ్రీ సత్యసాయి ఎయిర్ పోర్ట్" నిర్మాణము జరిగింది. దీనికి జరిగిన ఖర్చును 'శ్రీ సత్యసాయి సెంట్రల్ ట్రస్టు' వారే భరించారు.

ఈ వైద్యాలయంలో మెదడు, గుండె, మూత్రపిండాలు, ఊపిరితిత్తుల ఆపరేషన్లకు ప్రత్యేకమైన విభాగములుంటాయి. సమస్త వైద్య సౌకర్యాలను ఉచితంగా అందజేసే ఈ హాస్పిటల్ నిర్వహణకై నెలకు 1.5 కోట్ల రూ॥లు ఖర్చుకాగలవని అంచనా.

ఒకప్పుడు అందరికీ అందని అందలంగా, అందుకోలేని ఆకాశసౌధంగా ఉన్న అతి ఖరీదైన— వైద్యసౌకర్యం నేడు పుట్టపర్తిలో అతి సామాన్యునికి సహితం ఉచితంగా అందుబాటులో ఉండటమనేది— భగవానుని కరుణామయ దయార్ద్రహృదయం యావత్ మానవాళికి ప్రసాదించిన అపూర్వ వరం.



# శ్రీ సత్యసాయి ఇన్‌స్టిట్యూటు ఆఫ్ హైయర్ లెర్నింగు
## (డీమ్డ్ యూనివర్సిటీ)
# 10వ స్నాతకోత్సవ విశేషాలు



శ్రీ సత్యసాయి ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హైయర్ లెర్నింగు (డీమ్డ్ యూనివర్సిటీ) యొక్క 10వ స్నాతకోత్సవము నవంబరు 22, 1991న విద్యాగిరి స్టేడియంలో అత్యంత వైభవోపేతంగా జరిగింది. లక్షలాది భక్తుల సమక్షంలో జరిగిన ఈ స్నాతకోత్సవములో ముఖ్య అతిథిగా భారత ప్రధాని శ్రీ పి. వి. నరసింహారావుగారు పాల్గొన్నారు. వీరితోపాటు ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ జనార్దన్ రెడ్డి, గవర్నర్ శ్రీ కృష్ణకాంత్, మాజీ ముఖ్యమంత్రి శ్రీ చెన్నారెడ్డి, కర్ణాటక ముఖ్యమంత్రి శ్రీ బంగారప్ప మున్నగువారు ఈ ఉత్సవములో పాల్గొనుటకు విచ్చేసినారు.

నవంబరు 22వ తేది మధ్యాహ్నం 2-30 గం॥లకు విద్యాగిరి స్టేడియంలో ఇన్‌స్టిట్యూట్ విద్యార్థుల బ్యాండు గ్రూపు ముందర నడువగా, ఛాన్సలర్ భగవాన్ బాబావారు, ముఖ్య అతిథి శ్రీ పి. వి. నరసింహారావుగారు, వైస్-ఛాన్సలర్ శ్రీ సంపత్ మున్నగు వారందరూ శాంతివేదికను చేరుకొని తమ తమ స్థానముల నలంకరించినారు.

విద్యార్థులచే గావింపబడిన వేదమంత్ర పఠనముతో కార్యక్రమము ప్రారంభమైనది. ముందుగా వైస్-ఛాన్సలర్ శ్రీ సంపత్ మాట్లాడుతూ, సత్యసాయి ఇన్‌స్టిట్యూట్ చేపట్టిన సమగ్ర విద్యా విధానమును గురించి, గత కొద్ది సంవత్సరాలలో ఇన్‌స్టిట్యూట్ సాధించిన ప్రగతిని గురించి వివరించారు.

అనంతరం భగవాన్ బాబావారు స్నాతకోత్సవం ప్రారంభించినారు తదుపరి, విద్యాభ్యాసంలో చక్కని ప్రతిభను ప్రదర్శించి మొదటి ర్యాంకులను సాధించిన విద్యార్థినీ విద్యార్థులకు ఛాన్సలర్ బాబావారు స్వయంగా బంగారు పతకముల నందజేసి, ఆశీర్వదించినారు. ఈ స్నాతకోత్సవములో బంగారు పతకములను సాధించిన విద్యార్థినీ విద్యార్థుల వివరాలు:—

సిద్ధార్థపాల్ దాస్ B. A,
ప్రశాంత్ కుమార్ శ్రీనివాసన్ B. Sc.. (M.P.C.)
వినయేష్ సహాని B. Com.,
కుమారి ఎన్. శ్రీ విద్య B. Sc. (Home science)
కుమారి అంఖి ముఖర్జీ M. A., (Eng. Litt.)
ఎస్. వి. రాజేంద్రకుమార్ M. Sc. (Bioscience)
ఎం కృష్ణమూర్తి M. Sc, (chem.)
ఎం. వి. సూర్యనారాయణరావు M. Sc, (Maths)
కామూరి శ్రీనివాస్ M. Sc., (Physics)
మరివాలా రవిచంద్రు M. B. A.,
కుమారి నిధి కపూర్ B. Ed,

ఈ సంవత్సరం Ph. D., డిగ్రీలను పొందిన వారి వివరాలు;—

ఎస్. కనకదుర్గ (ఇంగ్లీషు)

ఆర్. రామకృష్ణన్ (గణితం)
పి. హెచ్. శివసాయిరమణ (కెమిస్ట్రీ)
వండూరి శ్రీనివాస్ (కెమిస్ట్రీ)

అనంతరం శ్రీ పి. వి. నరసింహారావుగారు తమ స్నాతకోపన్యాసమును ప్రారంభిస్తూ, "భగవాన్ బాబావారు తమ దివ్యాశీస్సులను నాపై కురిపించుటకే నన్ను ఈ స్నాతకోత్సవమునకు ఆహ్వానించినారని విశ్వసిస్తున్నాను. ఇట్టి మహాభాగ్యమును నాకందించినందుకు వారికి కృతజ్ఞతలు తెలుపుకొంటున్నాను" అని అన్నారు.

సత్యసాయి ఇన్‌స్టిట్యూట్ చేపట్టిన విద్యా విధానాన్ని భారత ప్రధాని కొనియాడుతూ, "విద్యా రంగంలో సత్యసాయి విద్యాసంస్థ ఆదర్శప్రాయమైనది ఇక్కడ విద్యతో పాటు ఆధ్యాత్మిక నైతిక శిక్షణ కూడా విద్యార్థులకు లభిస్తున్నది. దీని ఫలితంగా విద్యార్థులలో మానవతా విలువలతో కూడిన సత్‌శీల పరిణామం కలుగగలదు. ఇట్టి విశ్వవిద్యాలయ స్నాతకోత్సవంలో పాల్గొనే మహాభాగ్యం నాకు లభించినందుకు ఆనందిస్తున్నాను. ఈ విశ్వవిద్యాలయమునకు చెందిన సైన్సు విభాగములన్నీ అధునాతనమైన పరికరములతో కూడియున్నవి. ఇక్కడ నెలకొల్పబడిన 'కంప్యూటర్ సెంటర్' మన దేశ వ్యాప్తంగా గల విశ్వవిద్యాలయాలకు సంబంధించిన అత్యుత్తమ కంప్యూటర్ సెంటర్‌లలో ఒకటి" అని అన్నారు.

ఈనాడు విద్యారంగంలో చేపట్టవలసిన సంస్కరణల గూర్చి ఆయన మాట్లాడుతూ, 'ఈనాడు వ్యక్తిగతంగా, సామాజికంగా కావలసిన స్పృహను విద్యార్థులందరిలో కల్గించడమే విద్యారంగం ప్రధానాశయం కావాలి. స్వాతంత్ర్యము వచ్చిన నాటి నుండి నేటి వరకు దేశంలో విద్యార్థుల, విద్యాసంస్థల సంఖ్య విపరీతంగా పెరిగి పోయింది. కాని, నైతిక విలువల ప్రాముఖ్యత నేటి విద్యారంగంలో క్షీణించి పోయింది. కనుక, మన విద్యారంగానికి శ్రీ సత్యసాయి విశ్వ విద్యాలయము వంటి విద్యాసంస్థలే, మంచి భవిష్యత్తును కలిగించగలవు. నేటి పరీక్షా విధానము కూడా సంస్కరింపబడాలి. నూటికి 30 మార్కులు వస్తే ప్యాసయ్యే పద్ధతి సరియైనది కాదు. అందుచేత నూతన విద్యావిధానాన్ని ప్రవేశ పెట్టడానికి ప్రయత్నిస్తున్నాము. సత్యసాయి విశ్వవిద్యాలయము చేపడుతున్న విధానము మన దేశ విద్యారంగంలో గల లోపాలను సవరించగలదు. అందుచేత, విద్యారంగంలో సంస్కరణలను ప్రవేశపెట్టడానికి, సాయి విద్యాసంస్థలను మార్గ దర్శకత్వంగా తీసుకుంటాము అని అన్నారు.

"ఈ విద్యాసంస్థలో చదివిన వారందరూ పరిపూర్ణ విద్యను పొందటమే గాకుండా, మంచి వ్యక్తులుగా సమాజంలో రాణిస్తారని నా దృఢ విశ్వాసం. మీరందరూ స్నాతకోత్సవ సమయంలో చేసిన ప్రతిజ్ఞను జీవిత పర్యంతము నిలబెట్టుకోవాలి. ధర్మాన్న ప్రమదితవ్యం" అనే విషయాన్ని మీ హృదయాలలో నిరంతరము స్మరిస్తూ రావాలి. ఇది మిమ్మల్ని మంచి మార్గంలో నడిపించగలదు, ఈ శుభ సందర్భంలో డిగ్రీలు పొందుతున్న విద్యార్థులందరికీ నా అభినందనలు తెలియజేస్తున్నాను" అని ఆయన విద్యార్థులకిచ్చిన సందేశంలో పేర్కొన్నారు.

"మున్ముందు ఈ ఇన్‌స్టిట్యూట్ అత్యున్నత శిఖరాలను అందుకోవాలని నేను ఆకాంక్షిస్తున్నాను. రాబోయే సంవత్సరాలలో ఈ విద్యాసంస్థ పురోగతిని శ్రద్ధతో తిలకిస్తూ, దీని యొక్క ప్రభావాన్ని విద్యారంగంలో దేశవ్యాప్తంగా వ్యాపింపజేసే విధానాన్ని పరిశీలిస్తాను. జైహింద్" అంటూ శ్రీ పి. వి. నరసింహారావు గారు తమ స్నాతకోపన్యాసాన్ని ముగించారు. అనంతరం ఛాన్స్‌లర్ బాబావారు తమ దివ్య సందేశాన్ని అనుగ్రహించారు. ఇన్‌స్టిట్యూట్ విద్యార్థుల బ్యాండు గ్రూపుచే గావింపబడిన జాతీయ గీతాలాపనతో ఆనాటి స్నాతకోత్సవము ముగిసింది.

# శ్రీవారి 66వ జన్మదినోత్సవం

భగవాన్ బాబావారి 66వ జన్మదినోత్సవాన్ని ప్రశాంతినిలయంలో నవంబరు 23వ తేదిన లక్షలాది భక్తులు అత్యంత ఆనందోత్సాహాలతో, భక్తిశ్రద్ధలతో జరుపుకొన్నారు. ప్రపంచము నలుమూలల నుండి అశేషజనవాహిని జన్మదినోత్సవానికి సుమారు 10 రోజుల ముందుగనే ప్రశాంతినిలయానికి తరలిరాసాగినది. ఈ సందర్భంగా మందిర ప్రాంగణము, విద్యాగిరి పరిసర ప్రాంతములన్నియు నేత్రపర్వంగా అలంకరింప బడినవి.

నవంబరు 23వ తేది ఉదయము 4 గంటల నుండియే భక్తులు విద్యాగిరి స్టేడియమును చేరుకొనుట ప్రారంభించినారు. పసిబాలురు మొదలుకొని పండు వృద్ధుల వరకు ఇసుక వేస్తే రాలనట్లుగా అంతటా క్రిక్కిరిసిపోయి, శ్రీవారి రాకకై వేయికళ్ళతో ఎదురు చూడసాగిరి. ఉదయము 8 గంటలకు భగవాన్ బాబావారు విద్యాగిరి స్టేడియమునకు విచ్చేసారు. స్టేడియము ముఖద్వారము వద్ద శోభాయమానంగా అలంకరింపబడిన వెండి రథాన్ని అధిరోహించినారు. సర్వాలంకార శోభితయై సాయిగీత మందగమనముతో ముందుసాగగా ఊరేగింపు ప్రారంభమైనది. వేద మంత్రోచ్చారణ సల్పుతూ నడుస్తున్న విద్యార్థి బృందం వెనుకగా రజిత వర్ణ విరాజిత రథారూఢులై శ్రీవారు శాంతి వేదికను చేరుకొని, భక్తుల కరతాళధ్వనుల మధ్య వెండి సింహాసనాన్ని అధిష్టించారు. బాబావారితో పాటు విచ్చేసిన నలుగురు ప్రముఖులు సింహాసనానికి ఇరువైపులా ఏర్పాటు చేయబడిన ఉన్నతాసనముల నలంకరించారు. శ్రీవారు తమ జన్మదినోత్సవ సందేశానంతరం, 'సూపర్ స్పెషాలిటీస్ హాస్పిటల్' విజయవంతముగా ప్రారంభించబడుటకు యథాశక్తిగ తోడ్పడిన నలుగురు ప్రముఖులను ఉచితరీతిని సత్కరించారు.

## భగవానుని ప్రేమభిక్ష

మొదటి వ్యక్తి :- న్యూయార్కు నగరానికి చెందిన శ్రీ హైగ్రేట్. బాబావారు ఈతని ఔదార్య శీలాన్ని కొనియాడుతూ, "ఇతడు ఎంతో ఉత్సాహ ప్రోత్సాహములతో ఆసుపత్రి కొరకై సుమారు 20 కోట్ల రూపాయలు విలువ చేసే చాలా ఆధునిక యంత్రములను అమెరికా నుండి పంపినాడు. ఈతడు ఇంతటితో విరమించుకోలేదు. ఇంకా ముమ్ముందు ఆసుపత్రిని అభివృద్ధి గావించాలని ఆశిస్తున్నాడు. ఈ విధంగా సంపాదించిన ధనాన్ని సద్వినియోగము చేసే బుద్ధి అందరికీ పుట్టదు. ఏ నూటికో, కోటికో ఒక్కరికి పుడుతుంది. ఇలాంటి త్యాగభావము చేత హైగ్రేట్ మన ఆసుపత్రికి చాలా సహాయము చేసాడు. న్యూయార్కులో నివసించే హైగ్రేట్ కుగ్రామమైన పుట్టపర్తిలోని ఆసుపత్రికి సహాయము చేయడమనేది గుర్తింప తగిన విషయము. స్వామి యొక్క నిస్వార్థ హృదయాన్ని గుర్తించి, హైగ్రేట్ ఈ విధమైన సహాయాన్ని అందించాడు. స్వామిపై అతనికి గల భక్తి విశ్వాసములే దీనికి మూల కారణము. ఈ విధంగా వర్ణిస్తూ అతనిని పొగడటము లేదు, అతని త్యాగానికి ఆనందిస్తున్నాను. ఇంతటితో ఆగక ముమ్ముందు కూడా యిలాంటి కార్యములలో హైగ్రేట్ ఇంకా త్యాగ భావాన్ని అభివృద్ధి గావించుకోవాలని నేను ఆశిస్తూ,

ఆశీర్వదిస్తున్నాను. ప్రేమ పుష్పాన్ని ఈ పాత్రలో పెట్టి, నా ప్రేమ భిక్షగా ఇతనికి అందిస్తున్నాను" అంటూ, పుష్పాకృతి కల్గిన ఒక అందమైన వెండి పాత్రను శ్రీ బ్రైగేట్‌కు బహూకరించారు.

రెండవ వ్యక్తి:- హాస్పిటల్ ప్లాను తయారు చేసిన శ్రీ క్రిక్లాఫ్. లండను నగరంలోని వాస్తుశాస్త్రానికి సంబంధించిన కళాశాలలో ఈతడు ప్రొఫెసర్‌గా పనిచేస్తున్నాడు. "ఎన్నో నెలలు రాత్రింబవళ్ళు కష్టపడి, అనేక శ్రమలకోర్చి ఇతడు ఆసుపత్రి ప్లాను చాలా బాగా వేసాడు. ఈతడు బ్రిటీషువాడు. ఎలిజబెత్ రాణిగారి 'బకింగ్‌హమ్ ప్యాలస్' వలె మన ఆసుపత్రిని కూడా ఒక ప్యాలస్‌లాగ తయారు చేసాడు. ఇతనికి కూడా నా ప్రేమభిక్షను అందిస్తున్నాను" అని శ్రీవారు తెలుపుతూ, మరొక అందమైన వెండి పాత్రను శ్రీ క్రిక్లాఫ్ కు అందజేసారు.

మూడవవ్యక్తి:- భగవానుని ప్రేమభిక్షను అందుకొన్న శ్రీ రామకృష్ణ. ఈతడు ఆసుపత్రి నిర్మాణాన్ని చేపట్టిన 'లార్సెన్ అండ్ టర్బో డివిజన్'కు జనరల్ మేనేజర్‌గా పని చేస్తున్నాడు. శ్రీవారు ఈతని సేవా తత్పరతను కొనియాడుతూ, "ఈతడు ఎక్కడైనా పని జరుగుతుంటే ఎప్పుడో ఒక్కసారి వెళ్ళి చూస్తుంటాడు కాని, మన ప్రశాంతినిలయములో ఆసుపత్రి పని జరుగుతుంటే వారానికి రెండు మూడు పర్యాయములు వచ్చి, నిర్మాణాన్ని శ్రద్ధతో పర్యవేక్షిస్తూ, ఎంతో భక్తి శ్రద్ధలతో దీనిని అభివృద్ధి గావించాడు. దీనిని తనయొక్క పనిగా భావించి హృదయపూర్వకంగా తోడ్పడ్డాడు. ఇతనికి కూడా నా ప్రేమ భిక్షను అందిస్తున్నాను" అని, పుష్పాకృతి గల్గిన మరొక వెండి పాత్రను శ్రీ రామకృష్ణకు అందించారు.

నాల్గవ వ్యక్తి:- ప్రఖ్యాత వైద్య నిపుణుడు శ్రీ వేణుగోపాల్. "ఇంత ఆసుపత్రి నిర్మింపబడిననూ ఈ వ్యక్తి లేకుండిన నిరుపయోగమై పోయేది. ఇతడు తన భక్తి శ్రద్ధలను పూర్ణత్యాగములో అనుభవిస్తూ వచ్చాడు. ఒక దినానికి 10 ఆపరేషన్లు అవలీలగా చేయగలడు. ఈతడు ఢిల్లీలో పెద్ద పెద్ద సంస్థలలో పని చేస్తుంటాడు. ఇతనికి ఆపరేషన్ చేయడమంటే నీరు త్రాగినట్లు. అంతటి శక్తిమంతుడు. నిన్నటి దినమున నలుగురు పల్లెవాళ్ళకి ఆపరేషన్ చేయడము జరిగింది. ఒకరు 5 సంవత్సరముల బిడ్డ, ఒక విద్యార్థి, ఇద్దరు కూలీ పనులు చేసుకొనే ఆడవాళ్ళు. వారి బంధువులెవ్వరూ దగ్గర లేక పోవడము చేత తను ఎంతో ఆప్యాయంగా చూసుకొని, ఆపరేషన్లను ఫలవంతం గావించాడు. ఇంక రేపటి నుండి ప్రతిదినము అనేక ఆపరేషన్లు జరుగుతుంటాయి. "ముమ్ముందు ప్రపంచమంతటా "మానసిక రోగాలకు-దేహ సంబంధమైన రోగాలకు" చికిత్సకై ప్రశాంతి నిలయాన్ని చేరుకోవలసి వస్తుంది. వేణుగోపాల్ ఈ విధంగా తన సేవలను అభివృద్ధి చేసుకోవాలని ఆశిస్తూ, ఆతనికి నా ప్రేమభిక్షను అందిస్తున్నాను" అని తెలుపుతూ శ్రీవారు మరొక అందమైన వెండి పాత్రను శ్రీ వేణుగోపాల్‌కు అందించారు.

ఆ రోజు సాయంకాలము నెల్లూరు జిల్లాకు చెందిన ఒక బృందం 'సత్యహరిశ్చంద్ర' అనే నాటకాన్ని హృదయరంజకంగా ప్రదర్శించి భగవానుని, భక్తుల మన్ననలందుకున్నారు. ఈ రీతిగా "భగవానుని జన్మదినోత్సవం" అత్యంత వైభవోపేతంగా కన్నుల వైకుంఠంగా— జరుపబడి దేశ, విదేశస్థులందరికీ చిరస్మరణీయంగా రాణించినది.

—వి. వేంకటేశ్వర్లు, ప్రశాంతినిలయం.



# సనాతన సారథి చందాదారులకు విజ్ఞప్తి

కాగితం ఖరీదు, ప్రింటింగ్ ఛార్జీలు పెరిగిన కారణంగా సనాతన సారథి (తెలుగు, ఇంగ్లీషు) సంవత్సర చందా జనవరి 1992 మొదలు 20 రూపాయల నుండి 30 రూపాయలకు హెచ్చించవలసివచ్చినది. జనవరి 1992 పైగా రెన్యూవల్ చేయు చందాదార్లు నెలకు ఒక రూపాయి చొప్పున రెన్యూవల్ నెల వరకు పెంచిన ధరకు జోడించి పంపవలెను. ఉదాహరణకు:— ఫిబ్రవరి 1992 తో ముగిసే చందాదారులు 2 రూపాయలు, పెరిగిన ధర 30 రూపాయలకు జోడించి 32/— రూపాయలు పంపవలెను. అలాగునే మార్చి 1992 తో ముగియు చందాదారులు 3 రూ॥లు, ఆ తరువాత నుండి ప్రతి నెలకు ఒక రూపాయి చొప్పున జోడించి పంపవలెను.

ప్రస్తుతము మా దగ్గర లభ్యమయ్యే పుస్తకముల పేర్లు, వాటి ధరలు ప్రతి నెల సనాతన సారథి పత్రికలో ప్రచురింపబడును. మా దగ్గర లభ్యమయ్యే పుస్తకములు, వాటి ధరలు, పోస్టేజి ఛార్జీలు, రిజిస్ట్రేషను ఛార్జీల వివరాలు తెలుసుకోదలచినవారు, తమ చిరునామాతో స్టాంపు గల కవరు జతపరచి పంపాలి.

స్వదేశీదారులు 6 పుస్తకములకు లేక తక్కువ పుస్తకములకు (సుమారుగా 2 కేజీల బరువు) రిజిస్ట్రేషను ఛార్జీలు రూ॥లు 6-00, పోస్టల్ ఛార్జీలు రూ॥లు 10/— కలిపి మొత్తము రూ॥లు 16/— పుస్తకముల ధరలకు జోడించి పంపవలెను. అలాగునే సుమారుగా 3 కేజీల బరువు గల పేకెట్టు కొరకు రిజిస్ట్రేషను ఛార్జీలు రూ॥లు 6/—, పోస్టలు ఛార్జీలు 15/—కలిపి మొత్తము 21/— పుస్తకముల ధరలకు అదనముగా పంపవలెను.

విదేశీ చందాదారులకు: పోస్టేజి ఛార్జీలు నవంబరు 1991 న పెరిగిన కారణంగా సనాతన సారథి (తెలుగు, ఇంగ్లీషు) వార్షిక చందా జనవరి 1992 మొదలు 100 రూ॥లు నుండి (ఎయిర్ మెయిల్) 240 రూ॥లకు ( U. S. $ 10, £ 6 ఆ విలువకు తగిన తదితర విదేశీ కరెన్సీలు) పెంచవలసి వచ్చినది. అదే విధముగా సీ మెయిల్ చందాను 70 రూ॥లు నుండి 120 రూ॥లకు ( U. S. $ 5 £ 3 ఆ విలువకు తగిన తదితర విదేశీ కరెన్సీలు) పెంచడమైనది. ఇకపైన చందా రెన్యూవల్ చేయునప్పుడు వార్షిక చందా 240 రూ॥లు (ఎయిర్ మెయిల్), 120 రూ॥లు ( సీ మెయిల్ ) పంపమని ప్రార్థన.

ఈ దిగువ తెలియజేసిన సమయములలో ముగిసే చందాల విషయములో, పెరిగిన చందాలకు బకాయిలు జోడించి రెన్యూవల్ చేయవలెనని ప్రార్థన.

| | బకాయిల సొమ్ము | |
|---|---|---|
| చందా ముగిసే సమయము | ఎయిర్ మెయిల్ | సీ మెయిల్ |
| జనవరి—మార్చి 1992 | 25 రూ॥లు | 12 రూ॥లు |
| ఏప్రియల్—జూన్ 1992 | 50 ,, | 25 ,, |
| జూలై—సెప్టెంబరు 1992 | 75 ,, | 37 ,, |
| అక్టోబరు—డిశంబరు 1992 | 100 ,, | 50 ,, |